# అలమేలుమంగావిలాసం



పరిష్కర్త

డా॥ కె. సర్వోత్తమన్

ప్రథమ ముద్రణ
క్రోధన 1985

సర్వస్వామ్యములు : రచయితవి

ప్రతులు : 1000

వెల : రూ. 10-00

ప్రచురణ :
ఎం. లక్ష్మి
పారిజాత ప్రచురణలు–
6-7-554, శ్రీపురం కాలని
తిరుపతి.

ముద్రణ .

మాకెం ప్రింటర్స్,
తిరుపతి.

# మనవి

మనదేశంలో మారుమూల గ్రామాల్లో నయితేనేం, గ్రంథాలయాలలో నయితేనేం, ఎన్నో ప్రాచీన తాళపత్ర గ్రంథాలు వ్రాతప్రతులు ఇంకా చీకట్లోనే మగ్గుతున్నాయి. వాటిని పూర్తిగా సేకరించడం గాని, సేకరించిన వాటిని భద్రపరచడం గాని, భద్రపరచిన వాటిని వెలుగులోకి తీసుకొని రావడంలో గాని జరిగిన కృషి అంతంత మాత్రమే. ముద్రణాది సౌకర్యాలు ఎంత పెరిగినా ప్రాచీన సాహిత్యం అంతగా ప్రచురణ భాగ్యం. అందుకోలేదు. అంత మాత్రాన గ్రంథాలు రాలేదని కాదు. కొన్ని వచ్చాయి జిజ్ఞాస కలిగిన వారు అముద్రిత గ్రంథాల్ని పరిశోధనాంశంగా ఎన్నుకొని పట్టాల కోసం పరిశ్రమిస్తున్నారు. మరి కొందరు ఆర్థిక సహాయం లభ్యమయితే పదిమందికీ ఆ గ్రంథాల్ని అందించడానికి ఉబలాటపడుతున్నారు.

ఏదయినా అముద్రిత గ్రంథాన్ని ఎన్నుకొని అందులోని విశేషాలను బయటికి తేవాలని అనుకొంటున్నప్పుడు నా కంటబడిన ప్రతి 'అలమేలు మంగా విలాసం".

ఈ గ్రంథ విశేషాలు చెప్పినపుడు తమ ఆమోదాన్ని తెలియచేస్తూ ప్రోత్సహించిన వారు మా విశ్వవిద్యాలయ అధ్యక్షులు ఆచార్య జి. ఎస్. రెడ్డిగారు

శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయంలో ఉన్న ప్రతుల్ని వ్రాసుకోవడానికి అనుమతించిన వారు డా॥ శ్రీధరబాబు గారు. ఈ గ్రంథాన్ని ముద్రించుకోవచ్చని అనుమతి ప్రసాదించినవారు ఆచార్య శంకరనారాయణగారు.

నా ప్రయత్నాన్ని ప్రోత్సహించిన వారు కళాప్రపూర్ణ విద్వాన్ విశ్వం గారు, శ్రీ రావుల సూర్యనారాయణ మూర్తి గారు, శ్రీ కాట్రగడ్డ సుబ్బారావు గారు. డా॥ ఎస్. బి. రఘునాథాచార్య గారు

గ్రంథాలయంలోని వ్రాత ప్రతుల్ని, తాళపత్ర ప్రతుల్ని సరి చూడడంలో సహకరించిన వారు చి॥ శ్రీహరి, చి॥ గోవిందరాజు, శ్రీ అనందన్

ఈ గ్రంథం ప్రచురించుకోవడానికి వీలుగా కొంత ఆర్థిక సహాయం అందజేసిన వారు శ్రీ లక్ష్మీనారాయణ, I.A.S. (తి.తి.దే. కార్యనిర్వాహకులు)

అతి తక్కువకాలంలో అందంగా ఈ పుస్తకాన్ని ముద్రించి ఇచ్చిన వారు మాకం ప్రింటర్స్ అధినేతలు జె. యస్. మణి గారు.

అందరికీ నా కృతజ్ఞతలు

తిరుపతి

క్రోధన '85 —కె. సర్వోత్తమన్

# అలమేలుమంగా విలాసం

## కవి కాలాదులు :

అలమేలు మంగా విలాసమనే ఈ యక్షగానం వ్రాసిన కవి పేరు తెలియదు. మూళ్ళగిరి మంత్రి ప్రేరణతో ఈ కృతి వ్రాసినట్లు ఈ క్రింది పంక్తుల వల్ల తెలుస్తున్నది.

"మూళ్ళగిరి మంత్రి చంద్రుఁ
ముదముగా నొకనాఁడు హర్ష ముప్పొంగ
నను గారవించి మన్నన గౌరవించి
కనికరంబున మించి మమత వహించి
భవ దభిహిత భవ్య భావ శబ్దార్థ
వివిధ క్రియా సమన్విత దివ్య యక్ష
గానంబు లక్ష్మీ ముఖాబ్జ భాస్కరుని
సానందమయ మూర్తి కమల కీర్తి
వేంకట శైల నివాసుఁడౌ హరికి
సంకేతంబుగ చేయుమని యానతిచ్చె"

మూళ్ళగిరి మంత్రి యక్షగానం వ్రాసిన కవికి వత్సర గ్రాసం, నూరు వరహాలు, పోడుకాల్వలు, తురగం ప్రసాదించి నట్లు తెలుస్తున్నది.

ఈ కవి యక్షగానం ఆదిలో వెంకటాద్రిపతిని, వినాయకుణ్ణి, సరస్వతీ దేవిని మాత్రం స్తుతించాడు. అయితే యక్షగానంలో చాల కీర్తనలో కామగిరి పతి ప్రస్తావన ఉంది. ఇందులోని పాత్రలు కూడ ఆ స్వామిని స్మరించడం ఒక విశేషం.

మోహ మాయ నని వెసట నొందుచు
భాసుర కామాద్రి వాసుని దలచంగ

నా మనమున నిర్వేమిది యున్నదో వర
కామాద్రిపతికే నిక్కముగాను తెలుసు

కామగిరి ధామునికి నా మొరను కృపతే
నేమి సేతు

వర కామగిరిపతి హరుని శ్రీ జలధి
సుతా మహితా సమన్వితుని

ఏమో కాని వాని మనసెంత కరుగ దాయె
కామాద్రీశు వరమాన కలికి ఇది మాయ

కామగిరి వల్లభుని మృదు పద
తామరసముల సన్నుతించిరి

అంతే కాకుండా కవి

వర కామగిరి రామేశ్వరుని సుందరి యైన
గిరిరాజ తనయకు నముదుగ చెప్పిన

ఇది శైల నందినీ హృదయార వింద
మద నదన్విత దివ్య మధుక సదృశం

దై మహా మహిమతో నలరు కామాద్రి
రామేశ్వరునకు హర్ష ప్రదం బగుచు

అని స్పష్టం చేయడం వల్ల కవి హరిహరాభేదం పాటించని అద్వైతి అని నిర్ధా రించడానికి వీలుంది.

కవి మూళ్ళగిరి మంత్రిని ప్రస్తావించినా అతని గురించి ఎక్కువ వివరాలు ఇవ్వలేదు. అతని వంశవృక్షం ఈలాగున ఉంది




మూళ్ళగిరి మంత్రి ఇంటిపేరు ఈ యక్షగానంలో రెండు రూపాలలో కనిపిస్తున్నది.

భవ్య బంటి వంశ పావనుండు

సరస దివ్య బద్ది వంశ తిలకుండై

అందు వల్ల వీరి ఇంటిపేరు బంటి, బద్ది ఏదయినా కావచ్చు. వీరందరు ఆర్వేల నియోగులు. భారద్వాజసగోత్రులు. ఆపస్తంబ సూత్రులు. మేల్పాగొండ పురం దళవాయిలు.

తేజమంత్రి వీరుడు. దీనరక్షకుడు. అయితే ఇతడే ఏ వీరులను జయించాడో కవి పేర్కొనలేదు. ఏ రాజు దగ్గర దళవాయిగా పని చేశాడో చెప్పలేదు. తేజ మంత్రికి అక్కాంబ వల్ల కలిగిన కుమారుడు రామయమంత్రి. ఇతడు సర్వోర్వివిద హితుడు సారస్వతానంద సంపత్సమేతుడు, సర్వవిఖ్యాతుడని కవి స్పష్టం చేసినాడు.

## అలమేలు మంగావిలాసం — యక్షగానం

తెలుగు సాహిత్యంలో ఉన్నన్ని శతకాలు యక్షగానాలు ఇతర దాక్షిణాత్య భాషలలో కానరావు. ఈ కవి ఏ ప్రక్రియలోనయినా రచన చేపట్టగల సమర్థుడయినా ఈయక్షగాన ప్రక్రియనే అభిమానించినట్లు స్పష్టమవుతున్నది

"సకల దేవతా నమస్కారణంబును సుకవి పురస్కారణంబును
కుకవి తిరస్కారణంబును గావించి ...............కమనీయ
శృంగార రస నివాసంబగు నలమేల్మంగా విలాసంబను
యక్షగానంబు రచియింప బూని యున్న సమయంబున'

అని తన కృత్యాద్యవస్థను చెప్పుకొన్నాడు.

మహాశ్వగర మంత్రి కూడా

'భవ దభిహిత భవ్య భావ శబ్దార్థ
వివిధ క్రియా సమన్విత దివ్య'

యక్షగానం వ్రాయవలసినదిగా కోరాడు. ఇట్టియక్షగానాన్ని ప్రయోజన ప్రాధాన్యం. వివిధ ప్రక్రియలతోగల అంతరంగిక అనుబంధం, ఇతివృత్త వైవిధ్యం ఇట్టి మూడుకోణాలుగా వర్గీకరించవచ్చు.

ప్రబంధాల మోస్తరు కేవలం చదవడానికి మాత్రం పనికి వచ్చేవి. ఇవి శ్రవ్యయక్షగానాలు. హరికథల లాగా లేదా జంగం కథల మోస్తరు లేదా పురాణ గోష్ఠికి తగిన రీతుల్లో కథాకథన చాతుర్యంతో సాగేవి. ఇవి దృశ్య యక్షగానాలు. చదవడానికిన్ని, పాడుకోవడానికిన్ని అనుగుణంగా సాగిన రచనలు ఉభయ ప్రయోజనాత్మకాలు. ఈ దృష్టితో పరిశీలిస్తే అలమేలు మంగా విలాసం ఉభయ ప్రయోజనాత్మక మయిన యక్షగానం,

వివిధ ప్రక్రియారంగాలతో యక్షగానాలకు ఉన్న అంతరంగిక అనుబంధం బట్టి యక్షగానాలను 12 రకాలుగా వర్గీకరించడానికి వీలుంది. వీధి నాటకం, బొమ్మలాట, మార్గనాటకం, ఆధునిక రంగస్థలం, కలాపం, ప్రబంధం, ఉలా ప్రబంధం, కొరవంజి, ఏకాంతసేవ, హరికథ, పల్లకి సేవా ప్రబంధం, జంగం కథలే ఆ ప్రక్రియలు. వీటిలో అలమేలు మంగా విలాస యక్షగానం కొరవంజి, హరికథల ప్రక్రియలతో కూడిన యక్షగానమని చెప్పవచ్చు.

ఇతివృత్త వైవిధ్యం బట్టి యక్షగానాలను పౌరాణికాలు, చారిత్రకాలు తాత్కాలికేతి వృత్తాలు, సాంఘికేతివృత్తాలు, జానపదగాథలు, కల్యాణకథలు తత్త్వవిషయికాలు, ఇతరములు అని ఎనిమిది రకాలుగా వర్గీకరించవచ్చును.

పౌరాణికాలు రెండు రకాలు. మొదటిది భారతాది గ్రంథాల నుండి స్వీకరించినవి. రెండవది క్షేత్ర మాహాత్మ్యాలకు సంబంధించినవి.

అలమేలు మంగా విలాస యక్షగానంలోని కథ కొంత పౌరాణికం. మరికొంత జానపద మనస్తత్వానికి అనుగుణంగా సాగిన సన్నివేశాలు కలది.

# కథాసంగ్రహం

శ్రీవారికి బ్రహ్మోత్సవం సంబరంగా సాగింది. ఎన్నో వాహనాలలో స్వామి ఊరేగాడు. చివరకు రథోత్సవం రానే వచ్చింది. ఎక్కడెక్కడి వారో ఆ స్వామిని దర్శించడానికి కొండకు వచ్చారు. ఆ దివ్యమంగళాకారుని దర్శించి తరించారు. విజయదశమి దాటిపోయింది, మరునాటి రోజు స్వామి సేవ తీర్చుకున్నాడు. పడతులు పసిడిగిండియలలోని పన్నీటితో స్వామిని జలకమాడించారు మజ్జనం మనోహరంగా సాగింది. స్వామి కాంచనవస్త్రం కట్టారు. కస్తూరి అలదారు.

తీర్చాడు. ఆపై సంధ్యవార్చాడు. ఆ తరువాత రసాన్నాలను తృప్తిగా సేవించాడు
అప్పటికి మధ్యాహ్నమయింది. అలమేలు మంగతో అడవికివెళ్ళి ఒకగడియలో
వస్తానని చెప్పాడు. కాని అమ్మవారు ఒప్పుకోలేదు. లాలించాడు. ఊరడించాడు.
మెప్పించాడు. సొక్కించాడు. చివరకు అమ్మ సరే నంది. బంగారు కిరీటం
మెరుస్తుంటే, మకరకుండలాలు అటూ ఇటూ ఊగిసలాడుతుంటే మెడలోని
హారాలు కదలుతుంటే, కౌస్తుభం ప్రకాశిస్తుంటే ఉంగరం తొడుక్కొని కదిలాడు
గుర్రమెక్కి స్వామి కదులుతుంటే చతురంగబలం అతన్ని సాగనంపింది.
స్వామికి లక్ష్మిపై మనసు పోయింది. చక్కా ఆవిడ అంతఃపురంకేసి గుర్రాన్ని
దౌడు తీయించాడు. అక్కడ ఆ తల్లి అన్నిహంగులు సమకూర్చింది.

లక్ష్మిదేవికి పట్టరానంత పరవశం. మరో వైపు ఇంతకాలం స్వామి
తన్ను పీడించాడు కదా అన్న ఆవేదన. అంచేత కాస్త ఘాటుగానే మాట్లాడింది.

"స్వామీ! ఈనాటికి నేను గుర్తుకు వచ్చానా. ఈ దీనురాలి మీద దయ
తప్పిందా. మీరు వెళ్ళినప్పటి నుండి నాకు కునుకులేదు. సాటి వారిలో నగు
బాటుకు గురి అయ్యాను. నమ్మినందుకు నాకు తగిన శాస్తే జరిగింది'' అ
నొప్పుకుంది.

అపుడు స్వామి లక్ష్మిని లాలిస్తూ

'ఎంత మాట్లాడావు. నిన్ను మనసు ఎపుడూ అనుకోబట్టే కదా ఇక్కడికి
ఈ వేళ వచ్చాను. నాకు వేలమంది ఉన్నా నీవే కదా నా ఇల్లాలివి. నా మనసులో
ఏముందో ఆ రామేశ్వరునికి తెలుసు'' అని చేయి నొక్కాడు. ఆ మాటలకు,
చేతలకు లక్ష్మి కరిగిపోయింది.

"గడియపొద్దు'' వాటింది. స్వామి రాలేదు. అలమేలు మంగమ్మ
ఆలోచనల్లో పడ్డది. అడవికేసి వెళ్ళాడని కాసేపు ఊరుకుంది. వస్తాడని
ఎదురుచూసింది. రాక పోతాడా అని మనసుకు సమాధానం చెప్పుకొంది. ఎంతకు

రాలేదని ఎదురుతెన్నులు చూసింది. చివరకు రాడేమోనని దిగులు పడింది. ఆ దిగులుతో వగలుపడింది. తన భయాన్ని చెలికత్తెలతో చెప్పుకొంది. ఎక్కడున్నాడో చూసిరండని చెలికత్తెలను పురమాయించింది. వనంలో వెతకమంది. బ్రహ్మజ్ఞానులలో కలిసి పోయాడేమో జాగ్రత్తగా చూడమంది. మునివాటికల్లో తచ్చాడు తున్నాడేమో వెతకమంది. హోమం చేసేచోట తిరుగు తున్నాడేమో కనుక్కోమంది. ఆవిడ హడావిడికి చెలికత్తెలు చెరోవైపు పరుగులెత్తారు.

ఒక చెలికత్తె లక్ష్మి అంతఃపురం కేసి నడిచింది, అక్కడ లక్ష్మీ సమేతుడయిన నారాయణుణ్ణి చూసింది. చెలికత్తె కేం చేయాలో తోచలేదు. ఆలస్యం చేస్తే అమ్మ కొంప కాలుతుందని అర్థమయింది. అందువల్ల వెంటనే గిరుక్కున తిరిగింది. మంగమ్మ ఇంటికి మరలి వచ్చింది. ఏం చెప్పాలో తోచలేదు. అయినా చెప్పింది ఇలా అంది.

“అమ్మా, విన్నావా! నీ వాడు ఆ డబ్బున్న వాల్గంటి వలలో పడ్డాడు నన్నసలు అతను చూడనే లేదు, చూసిన తరువాత ముక్త సరిగా ఏవో నాలుగు మాటలన్నాడు కాని మనసా ఏమీ మాటాడలేదు. పట్టీ పట్టనట్టు ఉంటున్నాడు. అంతే కాదమ్మా! నా ఎదుట ఆ స్వామి ఆవిడతో కులికిన కులుకులు, సొగసులు అబ్బబ్బా! నేను చెప్పలేనమ్మా” అంది. ఏది జరగ కూడదో అదే అయింది. అలమేలమ్మ ఆందోళనలో పడ్డది. అబ్బ! స్వామి ఎంత వంచకుడో ఆవిడకు అర్థమయింది.

“నా మగడు మంచివాడే. మచ్చికలతో నన్ను ఆదరించాడే. అయినా ఏం చేయను!” నోచిన నోములన్నీ బూడిదలో పోసిన పన్నీరయింది. ‘అవిద్య మాయలో నా స్వామి పడ్డాడు’. అని స్వామితో గడిపిన మధురానుభూతుల్ని ఏకరువు పెట్టింది.

అప్పటికే సాయంత్రమయింది. అలమేలమ్మ స్వామి విరహాన్ని భరించలేక పోయింది. ఆవిడకు స్పృహ తప్పింది. చెలికత్తెలు గుబేలు మన్నారు.

## IX

ఏం చేయాలో తోచక ఒకరితో ఒకరు మంతనాలు పంచుకున్నారు. చివరకు ఉపచారాలు చేశారు. వాటి వల్ల మంచి ఫలితమే దక్కింది. అలమేలమ్మకు స్పృహ వచ్చింది. అందరిని ఒకసారి తేరపార చూసింది.

“ఏందుకే ఈ ఉపచారాలు? స్వామిని వదలి క్షణం కూడా ఉండలేనే! నా స్వామి ముద్దుమొగం చూడకపోతే బతక లేనే! నా స్వామి చల్లని మాట వినందే నేనుండలేనే! మీరు చేయవలసినదంతా చేశారు. మానవ ప్రయత్నం అంతే! శకునం అడుగుదాం. ఏవరినయినా పిలవండే” అంది.

అక్కడ స్వామికి అలమేలమ్మ అవస్థ అర్థమయింది. ఆలస్యం చేయడం మంచిది కాదనుకున్నాడు. కమలతో వెళ్ళి వస్తానన్నాడు. ఆవిడ సరే నంది. స్వామి ఎరుకల సాని వేషం వేశాడు. బుట్ట పట్టాడు. దానికి బంగారు పూలు చుట్టాడు. దాన్ని తలమీద పెట్టుకొన్నాడు. చేత బెత్తం పట్టాడు. జిగేలుమనే రైక తొడిగాడు. సుగంధం ఒంటికి పట్టించుకున్నాడు. సొమ్ములు అలంకరించుకున్నాడు. చిరునవ్వుతో తిరుపతి చేరుకున్నాడు. అప్పుడే చెలికత్తెలు ఏం చేద్దామా అనే మీమాంసలో పడి ఉన్నారు. ఎరుకలసాని వారికి కంట పడింది. ఆవిడ మీద నమ్మకం కుదిరింది. అయినా అమ్మగారిని నడగడం మంచిదని అనుకొని ఎరుకల సాని వ్యవహారం చెప్పారు. మంగమ్మ సంబరపడింది. అయినా అవి దేవరో కనుక్కోవడం మంచిదనుకొంది. ఊరు పేరు మరీ మరీ వాకాబు చేసింది. ఎవరయినా అయితే తన గుట్టు రట్టు అవుతుందని. ఆ తరువాతే చేయి చాచింది.

ఎరుకల సాని నమ్మకం కలిగించి అయిదు గడియల్లో స్వామి రానున్నాడని భరోసా ఇచ్చింది. పసిడి సొమ్ములు పెట్టింది. పట్టు చీరలు దానం చేసింది. పైడి రవికెలు ప్రీతితో ఇచ్చింది. అప్పటికి రాత్రి అయింది. పైగా మన్మథుడు ఆవిడ మీద పగబట్టాడు. చివరకు తన చెలికత్తె కళావతిని పిలిచి తనగోడు వెలడి చేసుకొంది.

X

"అమ్మా! మదనుడు బాధ పెడుతున్నాడని అంటావెందుకు? అతనికి ఉన్నవల్లా తుంటవిల్లు, కందిపోయే బాణాలున్నూ, చంద్రుడు పీడిస్తున్నాడంటావా? అతనికి ఎప్పుడూ క్షయరోగమే. వసంతుడు ఇబ్బంది పెడతాడంటావా? అతనికి తన కంటూ చోటు లేదే. పిల్లగాలి అల్లరి పెడుతుందంటావా? పాములు ఆ గాలిని మింగేస్తాయి. చిలుకలేమో అడవిలో ఉన్నాయి. అదీగాక తెలియక అడుగుతాను గాని మన్మథుడెవరమ్మా? ఎప్పుడో మంటల పాలయ్యాడు. చంద్రుడంటావా! ఆ సదాశివుని శాపంతో అగ్గిబుగ్గి అయ్యాడు. మాధవుడంటావా! పూవులు మోస్తున్నాడు అయినా ఎందుకమ్మా అంత బెంగ. నేను వెళ్ళి క్షణంలో వస్తా' నంటూ కళావతి లక్ష్మి అంతఃపురానికి దారి తీసింది.

జరిగినది యావత్తు స్వామికి నివేదించింది. స్వామి దిగులుపడ్డాడు లక్ష్మితో కదిలాడు. స్వామి రాక తెలిసి అలమేలుమ్మ అతణ్ణి ఆట పట్టించాలనుకొంది తలుపుకు గడియ పెట్టింది. అతణ్ణి ఊరించింది. చివరకు వేడుకోగానే అవిడ తలుపు తీసి పలకరించింది. కాని అతని వాలకం, పైగా వెంట లక్ష్మిని చూడ్డంతో నాగు పామయింది. లచ్చిని చూడ్డంతో అవిడ కస్సుమని లేచింది.

'ఏమిటే నీవు. నిన్నెవ్వరు నా ఇంటికి పిలిచారే? అసలు నీ ఊసు పట్టించుకొన్న దెవరే?'

'నేను కాదు వస్తా. స్వామి నాలుగు రోజులంటి వద్దు పంపేనే నేను వచ్చా. అయినా నేను నీకు సాటిదానినే. ఇటువంటి మాటలు మాట్లాడటం సరికాదు. అయినా ఇంటికి వస్తానే ఎదురుకోవడ మెందుకు:

'సరి దానివని సంబోధిస్తున్నావు. నీకూ నాకూ పోత్తె ఏమిటి? సరిదాని నన్ను మాని నివ్వరా',

ఇద్దరు సవతికయ్యం మొదలెట్టేసరికి స్వామి వారికి సర్ది చెప్పాడు. ఒకరికి తెలియకుండా మరొకరిని లాలించి మురిపించాడు. అప్పుడు చెలికత్తెలెంతో సంతోషించారు. లాలిపాటలు పాడి వారిని మెప్పించారు. రాత్రి గడిచింది. స్వామి దేవేరులతో మేల్కొన్నాడు. స్నాన సంధ్యాది కృత్యాలు ముగించాడు. అప్పుడు చెలికత్తెలు దేవేరులతో కూడిన స్వామికి ధవళ శోభనాలు పాడారు.

## సన్నివేశచమత్కారం :

దృశ్యకావ్యాలలో సన్నివేశాలకు అత్యధిక ప్రాధాన్యం ఉంది. ఆ సన్నివేశాలలో 'వేగం' ఉన్నప్పుడు సహృదయునిలో ఔత్సుక్యం పెరుగుతుంది.

అలమేలుమంగా విలాస యక్షగానంలో బ్రహ్మోత్సవం పూర్తికావడం స్వామి వాహ్యాళి వెడలడం, లక్ష్మిని చేరుకోవడం, అలమేలు మంగమ్మ పతి రాక పోయేసరికి కంగారు పడడం, స్వామి ఎరుక వేషంతో వచ్చి ఊరడించడం, మంగమ్మ విరహంలో పడడం, లక్ష్మితో స్వామి మంగమ్మ అంతఃపురం చేరుకోవడం, సవతుల ఐక్యం, చివరకు ఇద్దరిని ఏలుకోవడం ఈ యక్షగానంలో చకచకా సాగే సన్నివేశాలు. అయితే పరంపరగా చెప్పకొనే సన్నివేశాలలో ఒకటి రెండిటిని కవి మార్పు చేసి వ్రాసినట్లు స్పష్టమవుతుంది.

వాటిలో మొదటిది 'ఎరుక' పాత్ర.

అలమేలు మంగమ్మ శ్రీనివాసుని మోహంలో పడ్డప్పుడు స్వామి ఎరుకత వేషంలో రావడం ప్రసిద్ధం. కాని ఈ విలాసంలో విరహంలో పడ్డ మంగమ్మను అనునయించడానికి స్వామి రావడం ఒక విశేషం. ఈ మార్పు సహజంగానే ఉంది. సాధారణంగా లోకంలో వ్యక్తులకు ఒక వ్యక్తి పట్లగాని

ఒక వస్తువువట్ల గాని లేదా విధానంపట్ల నమ్మకం కుదిరితే ఆ పద్ధతిలోనే సాగా లనే అభినివేశం పట్టుదల కలుగుతుంది. అందుచేత అలమేలు మంగమ్మ స్వామి వస్తాడో రాడో అని శకునం అడగడం సమంజసంగా ఉంది,

ఇంక రెండవది స్వామి దేవేరులతో సంసార యాత్ర సాగించడం. సవతుల పోరు పడలేక స్వామి శిల అయిపోవడం ప్రసిద్ధం. కాని యక్షగానంలో స్వామి ఇద్దర్నీ లాలించి రాజీ పరచడం ఒక విశేషం, నాటకం చూసేవారు బరువుతో, బాధతో ఇళ్ళకు వెళ్ళ కూడదని కవి ఆలోచించి ఈ మార్పు చేసి ఉండవచ్చు.

## పాత్రలు :

ఈ యక్షగానంలో పాత్రలు చాల తక్కువ. శ్రీ వేంకటేశ్వరుడు, అలమేలు మంగమ్మ, లక్ష్మి. కొందరు చెలికత్తెలు మాత్రం

వేంకటేశ్వరుడు దక్షిణనాయకుడు. అతడికి అలమేలు మంగమ్మ ఎంతో కమల కూడ అంతే. అందువల్ల బ్రహ్మోత్సవం సంబరం ముగియడంతో లక్ష్మి ఇంటికి కదిలాడు వేంకటేశ్వరుడు. లచ్చి అడిపోసుకొన్నప్పుడు కూడా

'ఎంత మాటాడితివే-ఓ భామిని
ఎంత మాటాడితివే

ఎంత మాటాడితి వింతిరో-సంతత
మంతరంగమున నిన్నెంతో నమ్మినాను

మందగతి నిను చూచినదే పదివేలని మదిలోన నెంచి సమ్మతి
మందియున్న నన్నెంత మాటాడితి
వే వేల సతులలో నీవె మేటి' అన్నాడు.

అలమేలమ్మ విరహానికి గురి అయినప్పుడు దివ్య దృష్టిని చూచి

తెరవకు నిపుడు

దివ్య సంతోషంబు పరగింతు ననుచు
కమలాయతాక్షుఁడా కమలకు ననియె
నలత వేదనలచే నలమేలుమంగ
నను బాసి విరహ రత్నాకరంబున
మునిగి యున్నది దాని ముదము పొందించి

వేగవత్తు నన్నాడు. పైగా చివర

కమలతో ననియె నా కమలాయతాక్షుఁ
డీ వేళ నలమేల్మంగతో నన్నృత మాడి
జాగు చేసితి నీదు సన్నిధి నిఁక మీద
నీ పైన వచ్చి యా నెలఁత నెలిమి
గారవించిన మనంబున నూరడించి
దాని నన్నును గూర్చి నన్మాన మొదవ
నాల్గు దివసంబు లందుండి నడత తోడ
వత్తు వనుచును సమ్మతి పరచి యపుడు.

అనడంలో స్వామికి లక్ష్మిపట్లగల ప్రత్యేకానురాగం వ్యక్తమవుతుంది.

ఇక రెండవ పాత్ర 'అలమేలు మంగమ్మ'. కవి ఈమెను కైకేయి, సత్యభామలకు నకలుగా తీర్చాడు. కైకేయి లోని దబాయింపు, సత్యభామలోని ప్రణయకోపం రెండూ రంగరించిన రూపం అలమేలు మంగమ్మ.

ఇక మూడవ పాత్ర అయిన లక్ష్మిని సహనశీలగా కవి చిత్రీకరించాడు చాలా రోజులకు తన గుమ్మం త్రొక్కిన స్వామిని చూచి 'నేటికి దయవచ్చెనా నా స్వామి నీకు' అని హృదయం విప్పి ఆవేదన వెళ్ళగక్కుతుంది. స్వామిని మంగమ్మ దగ్గఱకు పంపడానికి సమ్మతించింది. అంతే గాకుండా పతితో సవతి ఇంటికి రావడానికి కూడ ఇష్టపడింది. ఏ రకంగా నయినా స్వామి మనసు ప్రకారం నడచుకోవడమే లక్ష్మిధ్యేయం.

నాల్గవ పాత్ర కళావతి. మంగమ్మ చెలికత్తె. మంగమ్మ విరహావస్థలో పడినపుడు మంగమ్మకు ఉపచారాలు చేస్తూ ఆవిడను అనునయించడానికి ప్రయత్నించిన స్నేహశీలి. ఈ చెలికత్తె స్వామి దగ్గరికి వెళ్ళి మంగమ్మ స్థితిని స్పష్టం చేసింది.

'మా సతి నేలుకోరా మంజులాకారా
భానురాంగ శ్రీ వేంకట శైలనివాసా విలసద్విలాసా
కన్నెరా చిన్నారి చెలులలో మిన్నరా
వన్నెలాడి వయసువ చిన్నరా'

అని రావలసిన అవసరాన్ని చెప్పింది. విరహాతిశయాన్ని విపులంగా వర్ణించింది. ఆ వర్ణనలోని తీవ్రతను గుర్తించాడు స్వామి. కనుకనే

'విని గుండె ఝల్లన వెరపు గదుర
ఘడియ కొత్తు నటంచు గరిమెతో పలికి
యెక్కడ దిన మెల్లను గడిపితి ననుచు'

కమలతో బయలు దేరాడు.

## రస విశేషాలు :

"వాక్యం రసాత్మకం కావ్యమ్" అని విశ్వనాథుడు కావ్య స్వరూపాన్ని విశదీకరించాడు. ఆస్వాదింపబడేది రసం. ఈ రసం శృంగారాది భేదాలతో తొమ్మిది రకాలు. వాటిలో శృంగారానికి రసరాజమనే ప్రసిద్ధి ఉంది. అందువల్లనే భోజుడు "శృంగార ఏవ మధురః పర ప్రహ్లాదనో రస, అని సరస్వతీ కంఠాభరణంలో స్పష్టం చేశాడు.

ఈ యక్షగానంలో శృంగారం ప్రధానరసం. తక్కినవి అంగాలు. ఈ కృతి వ్రాసిన కవి తాను 'శృంగార రస నివాసకబగు నలమేల్మంగా విలాపంబగు యక్షగానం' వ్రాయడానికి సిద్ధమయినట్లు స్పష్టం చేశాడు కూడా.

శృంగారం వియోగము, సంయోగమని రెండు రకాలు. విప్రలంభం వినా శృంగార పుష్టిః న విద్యతే అనడం అలంకారిక సంప్రదాయం. అందువల్లనే కవి అలమేలు మంగమ్మ విరహాన్ని అతిశయించి వ్రాశాడు. స్వామి రాకపోయేసరికి

"ఒక్క ఘడియకు నే నొత్తునని పల్కి సొక్కి
ఒక్క దినమెల్ల విభుఁడక్కడనే యున్నాడు".

అని బాధ పడుతుంది. సవతిని ఆడిపోసుకొంటుంది. స్వామి తనతో గడిపిన మధుర క్షణాల్ని చెలికత్తెలతో ఏకరువు పెట్టింది. చివరకు విరహంలో ఉన్మాదావస్థ చేరుకొంటుంది. అప్పుడు చెలికత్తెలు తమకేమి తోచక దిగాలు పడతారు,

'ఏమేమి సేయుదుమే - యీ పెతలాకు
ఏమేమి సేయుదుమే
ఏమేమి సేయుదు మీ మహితలమున
నేమెందు చూడ లేదే మందు నికమీద' అని

విశ్రాంతికి లోనవుతారు. చిగురుటాకులు తెచ్చి పాదాల పెడతారు. పూలగుత్తుల్ని కుచసీమ పై కప్పుతారు. తామరతూడుల్ని తెస్తారు. కన్నుల్లో కలువరేకులు, మొగాన పద్మదళాలు, కురులలో ప్రాచితిగలుంచి తమకు తెలిసిన శైత్యోపచారాలు చేశారు.

శృంగారంలో రెండవ విభాగం సంయోగ శృంగారం. నాయికా నాయకుల పరస్పరానురాగానికి సంయోగం చరమ గీత. ఈ సంయోగాన్ని కవి రెండు పద్ధతులలో వర్ణించాడు.

మొదటిది వియోగంలో సంయోగ ప్రశంస
రెండవది వియోగానంతరం సంయోగ వర్ణన

నాయకుడు దూరమయ్యేసరికి అతని తోడి సంయోగాన్ని నాయికలు చెప్పుకోవడం, స్మరించడం మొదటి భాగానికి చెందింది. ఈ యక్షగానంలో అలమేలు మంగమ్మ తన పతి చేష్టల్ని చెలికత్తెల ముందు చెప్పడం కొంత ఎబ్బెట్టయినా ప్రేక్షకుల్ని ఆకట్టు కొంటుంది.

కాము కేళికి నన్ను గారవించిన గుణధాముఁడు రాడాయనే
మాటి మాటికి నిక మాట రమ్మని మోవి
మాట మాటాడు నటి మేటి రాతిక మీద

ఏమిసేతునె చెలియ నా సామిటు రాడాయె

ముదమెద పొదువగ నెద నెద గదియించి
తుద మొద లెపగక పెదవి నొక్కుచును

సదయ హృదయ కామైకేశ యని తలచి తలచు
మదన కదనమున కడసిన విభుని చూచి

కాని లక్ష్మి మంగమ్మ లాగా చెలికత్తెల ముందు సంయోగానుభూతిని వల్లె వేసుకోలేదు. తన్నలరించిన స్వామి ముందు గుంభనగా చెప్పుకొంది.

ఇక రెండవది వియోగానంతరం సంయోగ వర్ణన. కవి కథకుడుగా ఈ వర్ణనల్ని వాచ్యం చేశాడు. లక్ష్మిని అలరించిన విధానాన్ని ఈ విధంగా వర్ణించాడు.

వెంకటాచల రమణుఁ డీటువలె ప్రీతి తోడ పలుకుచును ని
శ్శంకితను కరమరుదుగను శ్రీ సరసీరుహాముఖి కరము పట్టెను

పట్టి నంతనె ఎట్టకేలకు మట్టు మీరిన తమకమున జగ
జెట్టి చెంతను కదలి ముద్దుల పట్టి దిట్టదనమున నిలిచెను

నిలిచినంతనె కలికి చిలుకుల కొలికి కులుకు మిటారి గుబ్బల
నలుముచును దయ చిలుకు ప్రేమ దొలక చెలి కెమ్మోవి నొక్కెను

నొక్కినంతనె బలుసుక్కకను సొక్కి సొక్కి శౌరికి చిక్కిదక్కుచు
నిక్కమగు మక్కువ చెలంగ తళుక్కుమనగను పక్క చేరెను

చేరినంతనె శౌరి యలరుచు సారసాక్షిని మరుకేళిని
సారె సారెకు గారవించుచు కోరికలు మీరఁగ సుఖించెను

అలాగే లక్ష్మి అలిమేలు మంగమ్మలను ఒకరికి తెలియక మరొకరిని అలరించిన సన్నివేశంలో ధూర్త గోపాల లక్షణాలు స్పష్టంగా కనిపిస్తాయి.

## వర్ణనలు

ఇతివృత్త సౌష్ఠవానికి వర్ణనలు చాల అవసరం. ఈ వర్ణనలు వర్ణ నలుగా గాక కథకు పోషకంగా మలచడంలో కవి సామర్థ్యం కనిపిస్తుంది. అల

మేలుమంగా విలాస యక్షగానంలో పురవర్ణన, సూర్యోదయ, సూర్యాస్తమయ వర్ణనలు, కొరవంజి వేష వర్ణనలను కవి మనోహరంగా తీర్చాడు.

## పుర వర్ణన

ప్రబంధాలలో మోస్తరు ఈ యక్షగానంలో మొదట 'పుర వర్ణన' కనిపిస్తుంది. సాధారణంగా ప్రబంధాదులలో పట్టణంలోని నాలుగువర్ణాల వారిని పేర్కొనడం కనిపిస్తుంది. కాని కథ ఏనాటిదో కావడం వల్ల ఈ వ్యవస్థను కవి తడవలేదు. కేవలం పట్టణాలలోని పవిత్రతను, సంపదలను మాత్రము వర్ణించి ఉదాత్తతను నిలిపినాడు.

"సురముని ప్రవర ప్రతనాకరము
లక్ష్మీకరము రిపు భీకరము
దుష్కృత హరము శ్రీ వేంకటాద్రి పురము
వరమణి ప్రకారైక కృత గోపురము
వసుధ శశిముఖ నూపురము
సిరిపురము శ్రీ వేంకటాద్రి పురము
పరమపురుష విలాసమణి మందిరము
బహుసుందరము ఘనకందరము
జిత మంథరము శ్రీ వేంకటాద్రి పురము

## ప్రకృతి వర్ణనలు

ఈ యక్షగానంలో సూర్యోదయ, సూర్యాస్తమయ, రాత్రి వర్ణనలు కనిపిస్తాయి.

స్వామి లక్ష్మి, మంగమ్మలతో రాత్రి సుఖంగా గడిపిన తరువాత ఉదయించిన సూర్యుణ్ణి కవి ఈ యక్షగానాంతంలో వర్ణించాడు.

హరి దిక్కునందు వేగురుచుక్క జనియించె
తారలు కాంతిహీనలు వహించె
గవులకు కటిక చీకటి నిర్గమించె
వృక్షముల చకోరముల్ నందడించె
చక్రవాకములు నిశ్చలమతి రాణించె
కుక్కుటములు చాల కూసిమించె
కమలముల్ వికసించె కలువలు ముకుళించె
పక్షుల నినదంబు పరిఢవించె

దీపకళికలు ధవళకాంతిని ధరించె
సాంధ్యరాగంబు ఘనముగ పంచలించె
సూర్యుఁడుదయించె మంగళ తూర్య ఘోష
ములను దైత్యారి మేల్కాంచి ముదము నించె

ఈ వర్ణన వల్ల కవి సాధించిన ప్రయోజనాలు రెండు. మొదటిది లక్ష్మి, మంగమ్మల మనస్సులలోని అహంకార తిమిరం, అసూయాతిమిరం నశించిందని భంగ్యంతరంగా చెప్పడం. రెండవది ప్రబంధ వర్ణనలను పాటించడం.

అలమేలు మంగమ్మ విరహంలో పడ్డప్పుడు కవి సూర్యాస్తమయ వర్ణన చేశాడు.

ఎరుకవేషము పూలిన హరి తన
తరుణి కెరుక వచించె ననుచును
వరుణునకు తెలువగను పోయిన
తెరగునను రవి అస్తమించెను.

ఆడు రూపము పూని యుండిన
హరి\ పరమానందముననె
చూడ వలెనని వచ్చెనో యన
నాడ కాడకు తిమిర మొదవెను

మగని పాసిన మేలి అలమే
ల్మంగపై దండెత్తి వచ్చిన
చిగురు విల్తుని గొడుగు పోలిక
చెలగి చంద్రుండుదయ మొందెను.

కథాంశాలను వర్ణనలతో జతచేయడం ఈ పంక్తులలో కనిపిస్తుంది. అంతే గాకుండా జగజ్జనకుల లీలా విలాసాలు జగత్తుకంతా తెలిసిందని చెప్పడం కవి భావుకతకు చక్కని ఉదాహరణం.

## ఆకార వర్ణనలు

ఈ యక్షగానంలో వేంకటేశ్వరుడు, అలమేలు మంగమ్మ, ఎరుకల సాని వేషవర్ణనలలో కవి ఎంతో సహజత్వం ప్రదర్శించాడు.

కనక కిరీటంబు ఘనత వహించి
అకలంక రత్న ప్రభాఢ్యములయిన
మకర కుండలముల మన్నన దాల్చి
ముదమైన హారంబు ముత్యాల సరము
ధరియించి పచ్చల తళుకైన మెట్లు

కటకము లిక్కిలించి కమనీయమైన
కటి సూత్ర మొసరించి కౌస్తుభం బెదను

ఘటియించి ముద్దు టుంగరముల మించి
పటు శంఖ చక్రాది పరమ సాధనము

లారయ సంధించి హర్ష ముప్పొంగ.

ఈ వర్ణనలో గాంభీర్యం, రాజోచిత లాంఛనాలు స్వభావ సుందరంగా వర్ణింప బడ్డాయి. అల్లే విరహాతురమైన మంగమ్మ కోప హృదయాన్ని కవి సహజ సుందరంగా పారిజాతాపహరణం లోని సత్యభామ లాగ వర్ణించాడు.

వెంగ కుస్సట్టి మానిన చీరకట్టి
తలపట్టు పెట్టి మోదము కట్టి పెట్టి

ప్రియమెల్ల పోగొట్టి విరచుట్టు గట్టి

మంచి మాటాడక మానిని ఒడల
నించుక చూడక నెలమి పై నింద

గంధంబు పూయక కనక భూషణము
లందంబు చేయక నలుపు కన్నులాను

కాటుక బెట్టక కర్పూర వీటి
పట్టక పిక సమూహముల

పిలువక గడెయైన వెలదులు దంట
నిలువక కంటికి నిదుర పొందించ

కన్నంబు తినక శుకాళి కన్గొనక....

ఎరుకత వేషవర్ణన కూడ విట్టదే. ఆంధ్రసాహిత్యంలో శుకసప్తశతి (1-95-100) దశావతార చరిత్రం (7-285-290), వేంకటాచల మాహాత్మ్యంలో ఎరుకత వేష వర్ణన కనిపిస్తుంది. ఈ యక్షగానంలో ఎరుకత వేషం వేసిన స్వామి వర్ణన ఈలాగ ఉంది.

.... .... .... ఎరుకల బుట్ట
కరమున బట్టి బంగరు పూలచుట్టి
తల మీదబెట్టి బెత్తంబు చేపట్టి
కళబుట్ట కనుబట్ట ఘనమైన పసిడి
మిసిమి కల్గిన రైక మించుగా తొడగి
పసిమంచ కస్తూరి పచ్చకర్పూర
మగరు జవ్వాజిచే నందమైన బాల
జిగి గల్గు గంధంబు చెలువందగాను
మెయినిండ నలది కమ్మలు బాజు బంధు
రాణి ముత్యపు సరు లాదిగా కలుగు
సొమ్ములు ధరియించి సొబగు వహించి వెలయు
కమ్మని విడెము మేల్కారమున నుంచి
మొగమున చిరునవ్వు మొలకలు వెలయ
కాళ్ళ నందెలు గజ్జెలును
ఘల్లు ఘల్లు మనుచు నటింపగా
వేళ్ళ నుంగరములు తళుక్కని
వెలుగుచును రాణింపగా
జోళ్ళు కూడి నృపాంగనలు తన

సొగసు చాల నుతింపగా
మాళ్లు నొసగెద మింటికిని
రమ్మనుచు జను లర్థింపగా
మాటి మాటికిని బాలకుని పలు
మక్కువతో ముద్దాడుచు
ఆటపాటల నాదరించుచు
వాసిగను మాటాడుచూ
మేటి చక్కదనంబునను స
య్యాటలను తేలాడుచు
కోటి సంఖ్యల సతుల గని తన
కొడుకు కన్నము వేడుచూ
సొలుపుగను శిరమునను కదిలేటి
బుట్ట కరమున పట్టుచూ
కులుకుచూను సొలయుచునూ జారిన
కొప్పు చక్కగ కట్టుచూ
కమలతో బయదేరినాడు.

సంభాషణలు :

దృశ్యకావ్యాలకు సంభాషణం జీవం. అట్టి సంభాషణలు పాత్రో చితంగా సాగినపుడు పాత్రకు పుష్టి. కథకు నిండుదనం. సంభాషణలు రెండు రకాలు. ఒకరు ప్రశ్నించగా అంతా విని మరొకరుచెప్పడం మొదటిది. అలా గాకుండా ఒకరు ప్రశ్నిస్తుంటే వెంటనే వాటికి మరొకవ్యక్తి జవాబివ్వడం రెండ

## XXIV

పది. ఈ రెండురకాల సంవాదాలు అలమేలు మంగా విలాస యక్షగానంలో కనిపిసాయి.

తన పతి ఎప్పుడువస్తాడో అని మంగమ్మకు ఆరాటమయింది. శకున మడిగి ఊరట పొందాలనుకుంది. అప్పుడే ఎరుకల వచ్చింది. ఎరుకతో మనసులోని విషయల చెప్పాలనుకొంది. అయినా అసలు ఆవిడ ఎవరో వాకబు చేయనిదే చేయి చూపించకూడదనుకొంది. అప్పుడు

“ఎందుండి వచ్చితివే ఎరుకలసాని నీ
విందు వచ్చినది మాకానంద మయ్యెని

నీ రాజ్యమేది యేది నీ వంశమేదే
పూట పేరేమి నీ పేరు పెంపేమి

పిల్లలెందరు నీకు విభుండెందున్నాడు
పల్లవాధరి నీవు పలుకు నా తోడూ”

అని ప్రశ్నిస్తే అన్నిటికీ జవాబుగా —

“సకల దేశంబులు సంచరించే వారి
కొక దేశమని ఎట్లు నుడువుదురే

అకలంకమైన స్వయంభవులు
సుకరవ్యమున నాడు సురలందురే

ఊరడిగితివి యీ వూరే మా వూరని
సారె సారెకు నెల్ల జనులందురే

పేరు వారందురు వెంకటరమణుని పేరే
నా పేరని తెలియుదురే

ఇలమీద జలుమంచి ఎరుక చెప్పేవారి కులము
నా కులమని తెలుపుదురే”

ఒక పాత్ర ప్రశ్న లడుగుతుంటే మరొక పాత్ర జవాబు చెప్పడం పుత్తర ప్రత్యుత్తర సంభాషణం. ఇలాంటివి రెండు ఈ యక్షగానంలో కనిపిస్తాయి.

మొదటిది అలమేలు మంగమ్మ శ్రీనివాసుల సంభాషణ.

రెండవది లక్ష్మీ మంగమ్మల కలహ సంవాదం.

అలమేలు మంగమ్మ ఇంటికి శ్రీనివాసుడు రానే వచ్చాడు. మంగమ్మ బెట్టు చూపాలనుకొంది. తలుపు గడియ బిగించింది. స్వామి బయట నిలబడ్డాడు. అప్పటి వారి సంభాషణ ఇలాగ సాగింది.

"అలమేల్మంగామణి నే వచ్చితి
అలయుచు వాకిలి తీయవే

చెలువుడ నీ వగలెల్ల తెలిసెను
నిలువక నటు పోవోయీ

దంతి గమన నిను చేపట్టిన మా
ధవుడను వినవే భామా

వింతగ మాధవుడవై లే వనముల
వెలయింపగ పోవోయి

నక్రము చంపి గజేంద్రుని కాచిన
చక్రధరుడ నే భామా

చక్రధరుడవై లే ఘటముల ని
ర్వక్రత చేయుము పోవోయీ"

XXVI

అలమేలు మంగమ్మ స్వామిని బంగ్యతరంగా తిట్టినా కాసేపటికి వెనక్కి తగ్గింది. చలుప్ప తీసింది. స్వామి శాంతపడ్డాడు. కాని అతని వాలకం చూసేసరికి కోపంవచ్చింది. పైగా వెనకున్న లక్ష్మిని చూచి కస్సుమని లేచింది.

ఎంతటి దానివె కామినీ నీ
వెంత గయ్యాళివే భామినీ

నను జూచి నీకెంత రోసమా
నిన్నన పని ఏమి మోసమా

నిన్నెవరైనను పిలిచిరా
నిన్ను మదినైన తిన్నగ దలచిరా

జోటిరో నీసాటి సేయనా ఇట్టి
మాటలాడతే ముచ్చటాయనా

జూటు మాటలు నీకు చెల్లునా కొ
ట్లాటకు వచ్చేవు ఘల్లునా

## అలంకారం

తాను చెప్పదలచుకొన్న అంశాన్ని అందంగా చెప్పడానికోసం కవి అలంకారాలను వాడుతుంటాడు. ఆ అలంకారాలు పాత్రౌన్నత్యానికి, కథాసౌష్ఠవానికి తోడ్పడినపుడు రాణిస్తాయి.

అలమేలు మంగా విలాస యక్షగానం సామాన్య ప్రజానీకం కోసం వ్రాసినది. అందువల్ల కవి స్వభావోక్తికే ప్రాధాన్యమిచ్చాడు. అరుదుగా ఉత్ప్రేక్షలు కనిపిస్తాయి.

ఎరుకత అలమేలు మంగకు సోది చెప్పడానికోసం వచ్చింది. ఆవిడ వీథుల్లో ఊరేగుతుంటే ప్రజలందరు ఆవిడను, ఆవిడ రూపు రేఖల్ని చూచి ముగ్ధులయ్యారు. ఆ సందర్భంలో కవి వ్రాసిన పంక్తుల్లో ఉత్ప్రేక్షలు కనిపిస్తాయి.

“మరు డిట్టి వేషము పొందెనో అల్ల
పరమేష్ఠి ఈ వన్నె చిందెనో
హరి ఆడురూపము నందెనో ఆ
హరుడిట్లు చాతుర్య మందెనో”

మన్మథుడా, బ్రహ్మనా, హరియా, హరుడా అని ఊహించడంలో ప్రజలకు ఎరుకతపట్ల దేవభావమే కలిగిందని, లౌకిక భావనలు కలగలేదని కవి స్పష్టం చేశాడు.

ఎరుకత వచ్చి అలమేలు మంగమ్మకు సోది చెప్పి వెళ్ళింది. అప్పుడు సూర్యాస్తమయమయింది. చుట్టూ చీకటి అలముకొంది. అప్పుడు కవి రమణీయము లయిన ఉత్ప్రేక్షలతో ఆ సన్నివేశాన్ని మనోహరం చేశాడు.

రూపము పూని యుండిన
హరి పరమా నందమునను

చూడవలెనని వచ్చెనో యన
నాడకాడకు తిమిర మొదవెను”

“మగని బాసిన మేలి అలమే
ల్మంగపై దండెత్తి వచ్చిన

# XXVIII

చిగురు విల్తుని గొడుగు పోలిక

చెలగి చంద్రుడుదయ మొందెను'

తిమిరానికి హరి ఆకారానికి సామ్యం. రహస్యమయిన వింతను చూడడానికి రహస్య సమయమే తగినది. అందువల్ల స్త్రీ రూపం ధరించిన హరిని తిమిరం చీకటివేళ చూచిందనడంలో ఔచిత్యం ఉంది. అలాగే చంద్రునికి మన్మథుని గొడుగుకు పోలిక. గౌరవనీయులకు, పెద్దలకు, మహాత్ములకు గొడుగులు పడతాం. పతిని వాసినా అలమేలు మంగ ఆరాధ్యురాలని చెప్పడానికే చంద్రుడు గొడుగులా ఉదయించాడని అర్థవిశేషం. అంతేకాకుండా ఆవిడ విరహంతో కృశించినా చంద్రవదన అనడంలో సందేహం లేదు.

ఉక్తి చమత్కారం అలంకారాలకు ఆయువుపట్టు. అలమేలు మంగా విలాసకర్త ఈ ఉక్తి చమత్కారాన్ని చాల చోట్ల ప్రదర్శితం చేశాడు.

అలమేలు మంగమ్మ అంతఃపురానికి స్వామి వేంచేశాడు. అయినా అమ్మవారి కోపం చల్లారలేదు. ఆంచేత వాకిటి తలుపు మూసింది. స్వామిని నిలవేసింది. అనరాని మాటలంది. ఆ తమవాతే తలుపుతీసింది. అయినా స్వామి వన్నెచిన్నెలు చూసి మరల కస్సుమంది. అప్పుడు స్వామి ఆవిడను సముదాయిస్తూ ఆవిడ నమ్మడానికి గాను ప్రమాణాలెన్నో చేశాడు.

'జలధిలో మునిగి నిప్పులు గండు మీరెద

సింహ ముఖమునైన చేరి నేసుండెద' అన్నాడు.

ఈ వాక్యాలలో భీకర ప్రతిజ్ఞ చేయడం ప్రమాణమయినా స్వామి మత్స్య, కూర్మ నరసింహావతారాలు స్పష్టమవుతాయి.

## ఛందస్సు :

యక్షగానం మార్గదేశీ ప్రక్రియల సమాహారం. అంచేత ఛందస్సులో కూడా మార్గదేశిచ్ఛందోరీతుల సమ్మేళనం అనివార్యం, అయితే మార్గ ఛందో రీతులు చాల తక్కువ ఉంటాయి.

అలమేలు మంగా విలాసంలో ఒక్క శార్దూల వృత్తం మాత్రం ఉంది. అదీ కావ్యాదిలోనే. కందపద్యం' సీసం, తేటగీతి, ఆటవెలది. ద్విపదలు దేశిచ్ఛందోరీతులు. అయినా అలమేలు మంగా విలాస యక్షగానంలో పద్యాలకన్నా సంకీర్తనలే ఎక్కువ, ఈ రచయితకు సంగీతశాస్త్ర పరిచయం బాగా ఉన్నట్టు ఈతడు వాడిన కీర్తనలూ, వాటి రాగాలు స్పష్టం చేస్తున్నాయి. వీటిలో కాంబోది శంకరాభరణ రాగాలు కలిగిన కీర్తనలే ఎక్కువ. కారణం వాటికి కాలనియమం లేదు. ఎప్పుడయినా పాడుకోవచ్చు. అలాగే ఈ రాగాలలో నిర్దిష్టంగా ఒక భావాన్ని మాత్రం వ్యక్తం చేయాలనే నియమం లేదు. అంచేత కవి వీటిని బాగా వాడుకొన్నట్టు తెలుస్తున్నది.

ఈ యక్షగానంలో జానపద గేయ వరుసలు కూడా ఉన్నాయి. వాటిలో లాలి, ధవళం, శోభనం చెప్పుకో దగ్గవి.

లాలి :

మారాం చేస్తూ ఏడుస్తున్న బాలుని లాలిస్తూ తల్లులు పాడే పాట లాలి, ఈ యక్షగానంలో కయ్యాలికి తలపడి చివరకు రాజీ కుదరగా దేవేరులతో నిద్ర పోతున్న శ్రీ వెంకటాచలపతికి చెలికత్తెలు లాలి పాటలు పాడారు.

ముఖారి_అటతాళం

శ్రీరమణి చిత్తచోర దయారస
వారినిధి సురవార మందార

ఏడుపు రాగంగా ప్రసిద్ధమయిన ముఖారిలో లాలిపాట వ్రాయడం ఈ పాట విశేషం. సాధారణంగా లాలి పాటలు శంకరాభరణం, నవరోజు,

ఆనందభైరవి, శ్రీ రాగాలలో ఉంటాయి. నిర్దిష్టకాలాన్ని నిర్దిష్ట రాగంలో ప్రాయాలన్నది సూచన మాత్రం కాని సార్వత్రికం కాదు. అందుకే కవి స్వతంత్రించి ఈ రాగంలో లాలిపాటలు వ్రాసి ఉండవచ్చు. లలిత పదజాలం, సుకుమార భావం, అంత్యప్రాసలు ఈ పాటలోని విశిష్ట గుణాలు.

ధవళం

వివాహమయిన వ్యక్తిని వర్ణించే పద్యగతి ధవళం. ముత్తైదువలు హారతి పడుతూ పాడే పాట ధవళం. జయపదంతో ప్రారంభం కావడం, ఆశీర్వచనాత్మకంగా ఉండడం, షష్ఠ్యంతాలుగా ముగించడం ఈ ధవళ లక్షణం.

శ్రీమదలమేలు మంగా సమేతుడయిన అప్ప వేంకటేశునకు చెలికత్తెలు ధవళ శోభనాలు పాడారు.

"జయ రవి కోటి సంకాశా జయ జయ కారుణ్య విశేషా
జయ జయ సద్గుణ కోశా జయ జయ శ్రీ వేంకటేశా

జయాన్వితం కావడం. అంత్య ప్రాస యుక్తం కావడం ఈ ధవళం ప్రత్యేకత.

శోభనం పాట

ఈ పాటలకు సోబాన, సోబనం అనే పేర్లు కూడా ఉన్నాయి. మంగళ హారతుల వేళల్లో, మంగళ స్నానాదిక సమయాలలో శోభనం పాటలు పాడతారు. ధవళ శోభనాలు కలిసి వచ్చేచోట శోభనం పాట షష్ఠ్యంతంగా ఉంటుంది.

ఈ యక్షగానంలో దేవేరులతో శయనించి మేలొన్న శ్రీ వేంకటాచలపతికి చెలికత్తెలు ధవళ శోభనాలు పాడారు.

శోభానె-శోభానమే

'వేదము లానగిన ధన్యునకూ
విబుధుల పోషించిన మాన్యునకూ
భూ భారము మోచిన మూర్ధునకు
ఆదిమ మూర్తి నృసింహునకు

విష్ణుమాయా విలాసంలో 'తాళధ్వనితో వేమరు నటియింపుచు వీణాముని నారదుడు శోభనము వినిపించెన్ (పుట 25) అని ఉన్నది. ఈ యక్షగానంలో చెలికత్తెలు తమ తమ దేవేరులను స్వామి ఏలుకొన్నాడనే సంతోషంతో శోభనం పాడడం సముచితంగా ఉంది.

చూర్ణిక :

'అనావిద్ధ లలితపదం చూర్ణమ్' చూర్ణమ్ యొక్క రూపాంతరమే చూర్ణిక. ఇది ఒక గద్య భేదం. సాధారణంగా చూర్ణిక స్తుతి రూపకంగా ఉంటుంది. ఈ యక్షగానంలో 'చూర్ణిక' ఉంది.

స్వామి వేటాడి వస్తానని అలమేలమ్మతో చెప్పి లక్ష్మి ఇంటికి వెళ్ళాడు. తన స్వామి వస్తాడని ఎదురు చూసిన అలమేలమ్మకు ఆశాభంగమయింది. చివరకు అతని అచూకి కనుక్కోమని చెలికత్తెల్ని పురమాయించింది. చెలికత్తె లక్ష్మి నారాయణుని చూసిన వైనం చూర్ణికలో వర్ణితం.

శ్రీ మద్రామారమణీ రమణీయ కుంభి కుంభ
జుంబత్కుచ కుంభ పరిరంభణారంభ విజృంభణ
సౌరంభ సంభావ్యమాన మానసం.........
శ్రీ వేంకటాచలరమణ మాలోకమా మాన

ఈ చూర్ణికలో నారాయణుని పై కుంతవాసం కనులకు కట్టినట్టు వర్ణింపబడింది.

ఛందస్సుకు సంబంధించిన కొన్ని దోషాలు.

ఈ యక్షగానంలో కవి అజాగ్రత్త వల్లనో, లేదా లేఖక ప్రమాదం వల్లనో, ప్రతులు వ్రాసుకొన్నవారి అలసత్వం వల్లనో కొన్నిచోట్ల ఛందస్సుకు సంబంధించిన దోషాలు కనిపిస్తున్నాయి. అవి మూడు రకాలు. పాదదోషం. గణదోషం, యతిప్రాస దోషాలు.

పాదదోషం :

ద్విపదకు రెండేసి పాదాలుండడం నియమం. కాని కవి చాల చోట్ల ఒకపాదం మాత్రం వ్రాసి వదలి పెట్టాడు. వ్రాసిన బట్టి ఈ విషయం స్పష్టమవుతుంది.

'వీర రాగ తాళాది వర్ణితండగుచు
సరస శబ్దార్థ విశారదం బగుచు
మహితమా నలమేలు మంగా విలాస

పై వాటిలో మూడవపాదం అలాంటిదే.

గణదోషం

ద్విపదలలో మూడింద్ర గణాలు 1 సూర్యగణం గల పాదాలు రెండు ఉండాలి. ఇంద్ర గణాలలో నల, నగ సల, భ, ర, త లే తెలుగులో అంగీకరింపబడ్డ గణాలు. కాని వాటికి భిన్నమయిన గణాలుండడం కొన్నిచోట్ల కనిపిస్తుంది.

వెంకటా | చలనాథ | విరూపాక్ష | లింగ
ఘన కృపాం | బునిధికి | భాగ్య సమాజభనికి

పై వాటిలో యలగణం నలల గణం ద్విపదలతో రావు.

యతిదోషం :

లాక్షణికులు చెప్పని యతుల్ని పాటించడం యతిదోషాలు.

పెసమించు బంగారు పళ్లెరంబునను
నిగ నిగమను దేహ దీప్తులు చెలఁగ
మసలక కిసలయ పాణులు మిసిమి
ముందుగా భట సంఘముల నడపించి

పై ఉదాహరణాలలో క్రోగ్రీతలుంచిన చోట్ల యతిదోషం స్పష్టంగా కనిపిస్తుంది.

## ఆకరం - పరిష్కరణ

అలమేలు మంగా విలాసమనే ఈ యక్షగానం ప్రతులు ప్రస్తుతం రెండే ఉన్నాయి. మొదటిది తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయ సంస్థలో ఉన్నది. ఇది తాళపత్రి ప్రతి. దీని నెంబరు PL 1036 ఇందులో 49 తాళపత్రాలు ఉన్నాయి. తాళ పత్రపరిమాణం $16\frac{1}{2}$" X $1\frac{1}{2}$". చెరో వైపు 6 లైన్ల వ్రాత ఉన్నది.

రెండవ ప్రతి కూడా ఈ సంస్థలోనే ఉంది. ఇది వ్రాత ప్రతి. దీని నెం D 1836. శ్రీ పి. వి. కృష్ణమాచార్యులనే వారు 1944 - 45 ప్రాంతంలో ఈ ప్రతిని సంస్థలో భద్రపరచినట్లు తెలుస్తున్నది. ఇందులో 63 పుటలున్నాయి.

ఈ రెండు ప్రతులలోనూ వ్రాత బాగా ఉన్నా లెక్కలేనన్ని అక్షర దోషాలు, లేఖక దోషాలు కనిపిస్తాయి. ఈ పరిష్కరణలో వాటి సవరణకు ప్రాధాన్యమివ్వబడింది. ఈ రచన 'యక్షగానం' కావడం వల్ల భాషా విషయంలో ఏలాంటి మార్పు చేయలేదు. గ్రాంథికమయినా వ్యావహారికమయినా అల్లే ముద్రించడం జరిగింది. స్పష్టంగా తెలియని చోట మాత్రం ........గుర్తు ఉంచడం జరిగింది.

ఈ అముద్రిత గ్రంథంలోని అందచందాలను విలువ గట్ట గలిగిన వారు సహృదయులే.



# అలమేలుమంగా విలాసం

శ్రీ లక్ష్మిన్నిజవక్షమందు నిడి కుక్షిన్ సర్వలోకంబులన్
లీలామాత్రము తోడ నుంచి సుమణిశ్రేణీపినద్ధోజ్జ్వలన్
మాలాలంకృతుడై నితాంత మలమేల్మంగా కరాంభోజమున్
కేలంబట్టిన వేంకటాద్రిపతి సత్కీర్తిన్ మముం బ్రోవుతన్

అని కృతి కధిపతియైన వేంకటాచలపతి నేమని కొనియాడుచున్నాడు.

## శ్రీరాగం_ఆదితాళం

నమామి శేషాద్రివాసం సన్మందహాసం
నమామి శేషాద్రివాసం నవమణినీలభాసం సరసవిలాసం ॥నమామి॥

జలధిసుతారమణం కరధృతశంఖచక్రమాశ్రితభరణం
ఖలకులసంహరణం కమలాసన్నిభచరణం కరుణాభరణం ॥నమామి॥

దంతిపాంసలోలం స్వామి పుష్కరిణీ తటస్థితాపన్నశీలం
సంతత భవ్యలీలం............సద్గుణవాలం ॥నమామి॥

శ్రీమదంభోజగాత్రం దారుణ దురితస్తోమ తిమిరమిత్రమ్
తామరసాభినేత్రం కామగిరీశమిత్రం పరమపవిత్రం ॥నమామి॥

## శ్యామకల్యాణి_ఆదితాళం

మాం పాహి వినాయక సర్వదా _ మాం పాహి వినాయక
పాహి వినాయక పాహి వినాయక సర్వదా ॥మాం పాహి॥

మోదక ఖాదన మోదసదన లం
బోదర వామనవిగ్రహ
మూషికవాహన మునిజనపాలన
దోషపయోద సమీరణ ॥మాంపాహి॥

తామరసకర్ణ మనకామితదాయక
కామగిరీశ కుమారకా ॥మాంపాహి॥

## పూర్వీరాగం-ఆదితాళం

భారతి నన్ను పరిపాలన చేయరాదా
సారెకు నిన్ను నేను నమ్మించగ లేదా ॥భారతి॥

సంతసముగ నాకు చెంతకు రారాదా
దంతిగమన ప్రత్యక్షము కారాదా ॥భారతి॥

జాగాచేయక మేదినియందు నీరాదా
మాటామాటకు నాదు మనవి గైకోరాదా ॥భారతి॥

కామగిరీశుడయిన నీ మహిమలు తెలియ
దేమని వినుతింతు నిక నిప

## శంకరాభరణం-త్రిపుటతాళం

పండువెన్నెల పండినట్టు అఖండ తేజోమించవలయు నను
పండువగ కనుగొనెడు సుజనుల మదిని ఎంచెదా

గుణముగైకొని దోషమించుక గణనసేయక మెంగు సత్కవి
గుణములకు కడుభక్తి మీరగ ప్రణతిసేతు

పాకరస శబ్దార్థరీతి విశేషముల తెలియజను కవితల
నేకముగ రచించు కుకవుల నిందసేతు

వచనం :

ఇట్లు సకలదేవతా నమస్కారంబులును సుకవి పురస్కారంబులను కుకవి తిరస్కారంబును గావించి చిరంతన సేవాచింతన కవిప్రవర ప్రసాదంబున కమనీయ శృంగార రస నివాసంబగు నలమేల్మంగా విలాసంబను యక్షగానంబు రచియింపం బూని యున్న సమయంబున

అటువంటి ఆర్యాంబ యందనమానుష
కుటిలతా రహితు సత్కావ్యరచనాహితు
సారస్వతానంద సంపత్సమేతు
సారవైభవ జాతు సర్వవిఖ్యాతు

సమ్యగుక్తి ఫణీంద్రు సద్గుణసాంద్రు
రమ్యతా నిస్తంద్రు రాజమంత్రీంద్రు
నయముగ ముత్కాంబయందు వెండియును
సరస విద్యాతి వైశద్య భోగీంద్రు
సర్వభాషాహరిశ్చంద్రు బుధాళి
నిత్యావనోపేంద్రు నిర్మలపదస
కాంతిపరాభూత ఘనపూర్ణచంద్రు
సంతత లావణ్య సారరతీంద్రు
కమలసన్నిభనేత్రు కమనీయగాత్రుఁ
విమల చరిత్రు సభావళిజైత్రు

భూమీశ సంస్తుతామృత గుణాకరుని
శ్రీమూళ్ళ గిరిమంత్రి శేషఁ గనియె
ఆ నందనత్రయము నందు ప్రసిద్ధి
బూని పెంపొందిన పుణ్యశీలుండు
దానరాధేయుండు దాక్షిణ్యశాలి
మానధనుం డన మానగుణుండు
భోగదేవేంద్రుండు భువనైకవంద్యుఁ
డాగమోక్త విధిజ్ఞుఁ డఖిలార్థవేది
భూరిదేవద్విజ పూజాపరుండు
సూరి మందారుండు సుజనైకవినుతుఁ

డనఘ చారిత్ర సుభాంగనారమణుఁ
డనుపమ శ్రీనివాసామాత్య జనకుఁ
డమల దయాసాంద్రుఁ డనిశ నిస్తంద్రుఁ
డమిత వాక్యఫణీంద్రుఁ డార్యసమ్మతుఁడు

గిరిపైఁ దగు మూళ్ళగిరిమంత్రి చంద్రుఁ
డరుదుగా నొకనాఁడు హర్షముప్పొంగ
నను గారవించి మన్నన గౌరవించి
కనికరంబున మిలచి ఘనత వహించి
భవదభిహిత భవ్యభావశబ్దార్థ
వివిధ క్రియాసమన్విత దివ్యయక్ష
గానంబు లక్ష్మీముఖాబ్జ భాస్కరుని
కానందమయమూర్తి కమలకీర్తి
వేంకటశైలనివేశుఁడౌ హరికి
సంకీతంబుగ సేయుమని యానతిచ్చె

వచనం :

ఇట్లు జాంబూనదాంబరాశేషమణిభూషణ తాంబూలప్రదానంబుల నాదరించుటయు నేనును సంతత ....... మానసంతోషవిశేషస్వాంతుడనై నా యొనర్పం బూనిన అలమేల్మంగా విలాసంబను యక్షగానంబునకు కథాక్రమం బెట్టిదనిన

## సౌరాష్ట్రరాగం-త్రిపుటతాళం

సురమునిప్రవర ప్రతాపాకరము
లక్ష్మీకరము రిపుభీకరము
దుష్కృతహరము శ్రీవేంకటాద్రిపురము
వరమణిప్రకరైక కృతగోపురము
——వసుధాశశిముఖ నూపురము
సిరికాపురము శ్రీవేంకటాద్రి పురము
పరమపురుషవిలాస మణిమందిరము
బహుసుందరము ఘనకందరము
జితమంథకము శ్రీవేంకటాద్రిపురము

## ద్విపద-కళ్యాణిరాగం

ఆ పట్టణంబున కధిపతి యగుచు
'వాసుదే' యని దేవపంక్తి నుతింప
పంకజాక్షుఁడు శేషపర్వతాధిపుఁడు
వెంకటాచలపతి విబుధ మందారు
జడగతిఁ బూని నిప్పులును వెన్నిచ్చి
యడవులఁ బడి కప్పులందు వర్తించి
ధర బిచ్చమెత్తి పూతను వధియించి
తరుణిని గోల్పోయి ధరణిని దున్ని
కట్టుబట్టలులేక కలికిగా చెలఁగి
పట్టుగా నుండుట బరమ యుక్తంబు
తనకంచు తెలిసి వేదములుద్ధరించి
ఘనులైన విబుధుల కడిమి రక్షించి
వసుధను వెలయించి భక్తుని గాంచి
పొసఁగ నన్నకు రాజ్యమొసఁగ శత్రువుల
దునుమాడి జానకితోఁ గూడి యాడి
కనకాంబరునకు సగ్రజుఁడై చెలంగు
సర్వజ్ఞుడై వాలు సంధించినట్టు
సర్వేశ్వరుఁడు శంఖచక్రధరుండు
గజరాజవరదుండు కరుణాంబురాశి
ద్విజరక్షకుఁడు సుచారితరజాలి
భూదారుఁడర్భక పోషణశీలుఁ
డా దిత్యుఁ డవనీశ్వరాంతకుండు
రావణసంహారి రౌహిణేయుండు
శ్రీవినాయకుఁడు నాగివిభూషకుండు
క్షితిని పాలించు నక్షీణతేజమున
నతని దేశంబున ననిశము గురియు

వృష్టినే తుష్టిచే వివిధ సామ్రాజ్యంబు
సృష్టినే పుష్టిచే చెన్నొందు జనులు
మల్లెలు మొల్లలు మొలసిన లేటి
పిల్లల వల్లవ ప్రేమాగతోపు
పికముల శుకముల వెలయు కస్తూరి
మెకముల నికరము ల్వెలయంగ పూల
తీవల తావుల తివిరి పూఁచెనె
వాపుల మావుల పంక్తులు చెలఁగ
కొలఁకుల తెలఁకుల కొమరు మీరఁగను
పెళకుచు కులుకుచు ప్రియుల కెమ్మోవి
నొక్కుచు నిక్కుచు నాత్మమర్యాద
సొక్కుచు సొలుకుచు సొంపొందు నట్లు
చెలియలు వెలయఁగ చెలఁగిన వనము
అలరంగ మాతంగ హయ రథాంగాది
చతురంగ బలసంఘ సంభ్రమ మొసర
ప్రతిలేని మతిఁబూని ప్రబలిన భవ్య
సౌజన్య సన్మాన్య సుసమూదేవ
రాజన్య మూర్ధన్య లాలిత్యవిలస
మానిత పాదపద్మోత్కారం బెసఁగ
సూరిజన ప్రజసూక్తులిం బొసఁగ
పృథ్వీ తలంబున విఖ్యాతిఁ గాంచి
పృథు వైభవంబుల పెంపు వహించి
సకల మనోజ్ఞ దేశంబుల కెల్ల
నకలంక సద్వర్ణమగుచు రాజించె

క॥ ఈ పగిది పద్మలోచనుఁ
వాపుర మేలుచును ప్రజల ననవరతంబున్
కాపాడుచు ధర్మస్థితి
నే పారఁగ వెలసె నఖిల హితకరుఁడగుచున్

వచనం :

ఇటు సకల లోకాధిపత్యంబు చేయ సమయంబున

## శంకరాభరణం_త్రిపుటతాళం

జలము లతి నిర్మలము లాయెను జలధులను నదులెల్ల జేరెను
పులినములు కనుపించెను నలరుచు పొందుగాను
కంతు బాణములయిన చేమంతికా కుసుమాది సర్వాల
తాంతములు వికసించె మిక్కిలి ధరణి యందు
దినకర ద్విజపతులు నిర్మల దీప్తి గాంచిరి గగన తలమున
జనుల కనిశము సౌఖ్యముగ రాజన్న మొదనెక్

## ద్విపద_భైరవి రాగం

ఆ సమయమున నా వెంకటాద్రి
వాసుని భాసుర వర రథోత్సవము
వైభవంబుల జూడ వసుమతియందు
శోభిల్ల ప్రజలెల్ల సొంపుగున వచ్చి
శ్రీ వేంకటాద్రీశ శేషాచలేశ
గోవింద గోవింద గోవింద యనుచు
పరమ సంతోష నిర్భర చిత్తులగుచు
గరుడోత్సవం బాడి గా గల్గు సర్వ
సలలితోత్సవముల సరవి కన్గొనుచు
కలుషముల్బోఁదోలి గరిమెతో విజయ
దశమి నా దధిక రథారోహణంబు
కుశలత్వమునఁ గాంచి చిత్తంబు లలర
దీన మందార నదీ నగాధీర

మంగళ దేవతా మానపచోర
తుంగవిక్రమ మహాదోషవిదూర
పాలయాస్మాన్ త్వత్కృపాలయ భవ్య
శీల మంజుల గుణశీల యటంచు
పరిపరి విధముల వర్ణించిరంత
మరునాడు శేషాద్రి మందిరుండైన
వారిజనేత్రుండు పసిడి గిండియల
సారసగంధులు జలము లందీయ
మజ్జనం బొనరించి మనసు రంజిల్ల
ముజ్జగముల నేలు ముచ్చట తెలుప
శిస్తుగాఁ గాంచన చేలంబు గట్టి
కస్తూరి తిలకంబు కరమర్థి దిద్ది
సంధ్యాది కృత్యముల్ పరగున దీర్చి
సాంధ్యరాగప్రభా సాంద్రమై నట్టి
కెంపుల పీటపై గిరికొన్న వేడ్క
సొంపు మీరంగ కూర్చుండి యా వేళ
మసలక కిసలయ పాణులు మిసిమి
వెసమించు బంగారు పళ్ళెరంబునను
రసి రసాన్నము లపారముగ వడ్డించి
ఒసపరి భుజియించి యుపతృప్తి పొంది
సరసిజ వదనలు సలిలంబు లొసఁగ
పరిధౌత మృదుపాణి పాదాంబుఁ డగుచు
అడవిలోఁ బలు వేటలాడి నే నొక్క
ఘడియ కొత్తునటందు కరమర్థిఁ బల్క

లాలించి కీలించి లలి సూరడించి
మేలెంచి సొక్కించి మెప్పించి మించి
వెలయించి సొలయించి చేపట్టఁ బట్టించి
యలమేలుమంగచే ననుమతి వడసి
కనక కిరీటంబు ఘనత వహించి
మణిలంత రత్నప్రభాఢ్యము లయిన
మకర కుండలములు మన్ననఁ బాల్చి
మురుపైన హారంబు ముత్యాల సరము
ధరియించి పచ్చల తళుకైన మెట్టు
పటకము వ్రేలించి కమనీయమైన
కటిసూత్ర మొనరించి కౌస్తుభం బెదను
ఘటియించి ముద్దు టుంగరముల నుంచి
పటుశంఖ చక్రాది వరభూషణముల
దారయ సంధించి హర్షము పొంగ
సారట్టి ఘోటాణ మమరంగ నెక్కి
వామ దక్షిణముల వంది మాగధులు
సామి పరాకు హెచ్చరికంచుఁ దెలుప
భేరీమృదంగ గంభీరరవంబు
పారతూర్యాది విన్యాసములు మ్రోఁగ
చతురంగ బలములు చయ్యన నడువ
మితిమీర జనులు బారిక్తని వెంటఁగొలువ
నడతెంచి తురగ రత్నము డిగి వేగ
కదలి కోఁతుకు వాల కలుముల నెసఁగు

పడతి లక్ష్మీదేవి భవనంబుఁ జేరి
మణిమయంబగు పీఠమందుఁ గూర్చుండె

వచనం :

ఇట్లు సుఖాసీనుండైన వెంకటాచల రమణునితో లక్ష్మీదేవి యే మను చున్నది.



## ఎరుకలకాంభోజి_ఆటతాళం

నేటికి దయవచ్చెనా నాస్వామి నీకు - నేటికి
నాటను విడిచి నాబోటి దానిమీద - నేటికి

నిను బాసినది మొదలు నిదుర కంటికి రాక
వనవిల్తు బాధలకును తాళలేక
కనుమూసినంతలో కలవరింపుచు నిన్ని
దినములు చింతనొందిన నన్ను చూడగ ॥నేటికి॥

ఈ పొద్దే వచ్చెనని రేపే వచ్చెనని
నీ పాదాంబుజములు నెమ్మదినుంచి
నాపతి నీవని నమ్మినందుకే వేళ
చేపట్టి విడువ నుచితము కాదని యెంచి ॥నేటికి॥

నాపాటి వారిలో నగుబాటు చేసెను
నాసామి యనుచు నుల్లాసము లేక
మోసమా యనుచు వెతల నొందుచు
భాసుర శేషాద్రి వాసుని దలంచగ ॥నేటికి॥

వచనం :

అని పలికిన లక్ష్మీదేవితో వెంకటాచలపతి యేమనుచున్నాడు.

## కల్యాణిరాగం-అటతాళం

ఎంత మాటాడితివే ఓ భామిని
ఎంత మాటాడితివే ॥ఎంత॥

ఎంత మాటాడితి వింతగా - నంతర
మంతరంగమున నిన్నెంతో నమ్మిన నను
ఎంతమాటాడితివే ॥ఎంత॥

పశుపతి నిను జూచినదే పనియేలని
మదిలోన నెంచి సమ్మదమందియున్న
నన్నెంత మాటాడితివే
వేవేల సతులతో నీవే మేటి వటంచు
భావించియుండిన నావంటివానిని ॥ఎంత॥

నా మనమున నిత్యమేమి యున్నదో వర
కామాక్షి పలుకే నిక్కముగాను తెలుసు నన్నెంత

## మధ్యమావతి-అటతాళం

వేంకటాచల రమణుఁ డిటువలె ప్రీతితోడఁ బలుకుచును ని
శ్శంకతను కరమునదుగను శ్రీసరసీరుహముఖికరము పట్టెను
పట్టినంతనె యొట్టకేలకు
మట్టుమీరిన తమకమున జగ
జెట్టి చెంతను కదలి ముద్దుల
పట్టి దిట్టతనమున నిలిచెను ॥వెంకటా॥
నిలిచి నంతనే కలికి చిలుకల
కొలికి కులుకు మిటారి గుబ్బల
నలుముచును దయఁ జిలుక ప్రేమఁ
దొలుక చెలి కెమ్మోవి నొక్కెను ॥వెంకట॥

సొక్కినంటనె చెలి ప్రక్కకను సొక్కి
సొక్కి శౌరికి చిక్కి దక్కుచు
నిక్కమగు మక్కువ చెలంగ ర
దక్క మనసున పక్కజేరెను ||వెంక||
చేరి సంతనె శౌరి యాలకుచు
సార సాక్షిని సుచకేశిని
సారెసారెకు గారవించుచు
కోరికలు మీరగ సుఖించెను. ||వెంక||

వచనం :

ఇట్లు పరస్పర ప్రేమానుబంధంబునందంబుగా పద్మసరోవరంబున లక్ష్మీ సమేతుండై నప్పుట......ఇచట సంభ్రమంబునంగాంచి యేల యింత తడవు చేసెను నా ప్రాణనాయకుడనుచు విల్లదంబునంది చిత్తంబు ఝల్లుమనంగ ప్రాణపదమయిన చెలికోనె పలికెనప్పుడు-

## కల్యాణిరాగం-ఆటతాళం

పాట

ఏల రాదే బాలా వాఁడిప్పుడేల రాదే బాలా
ఈలాగు చేసేది మేలా వాడిప్పుడేల రాదే బాలా

వొక్కఘడియకు నే వొత్తునని పల్కి సొక్కి
ఒక్క దినమెల్ల విభుఁ డక్కడనే యున్నాడిప్పు ||దేలా||

మంచి మగడంచు తమిమించి నెనరుంచి
ప్రేమకించి వలపించి లాలించిన యీ అంచకేపు ||దేలా||
దాని అలపేటికే నాటచెలి బోధించెనో
నాట దయలేక మాటిమాటికని కోపమున వాడిప్పు ||దేలా||

ఇంతి విను మెంత వినిపింతు నిది యింతౌనని
చిత్తగింపక మోసపోతి పంత మొనరించి యిపుడేల రాదే ||దేలా||

కామగిరి ధాముని నా మీదను కృప లే
దేమి సేద భామా నను కామకేళి నేలనా దేల ॥ఏమి॥

## పున్నాగ – ఆదితాళం

ఏమి సేయుదు నమ్మ – ఓ భామ నే
నేమి సేయుదు నమ్మా ॥ఏమి॥

ఏమి సేయుదు నిక నే నోము నోచితినో
నా మీద దయలేక నా సామి యిటు రాడు ॥ఏమి॥

మాటి మాటికిని మాట రమ్మని పోవ
మాట మాటాడునట్టి మేటి రాదిక మీద ॥ఏమి॥
వేడుకతో నన్ను కూడిన మొదలుగ

జోడుసేయక యున్నవాడూ రాడా
ఏమి సేయుదునమ్మా ॥ఏమి॥

కాముని కేళిలోన ప్రేమతో నన్నేలిన
కామాద్రిపతి హితుడేమో వింతాలు సేసె
ఏమి సేయుదునమ్మా

## ఆటతాళం

ఏమో తెలియదు వాని వగ
కామినీ వినవే నా సామి విలాసము లేమో

కలకాలము ప్రాణకాంతుడు దాక రీతిగ మెలగుట ప్రత్యక్షమాయె
యిది నావంటి లలనకు కలుగునటె ॥ఏమో॥

ఎక్కడి మాట కలికిరో తొలి జన్మమున నోము పండినది
ఎంతో వింతాలు సేసి పంతగించెనని

యింతైన తెలియనైతి ఈ వేళను
కంతు దారికి లోనైతి........యింపెచట
చింతింప పనిలేదు చెలి నా విధి చర్యలేమో ||ఏమో||

కాముకేళి నన్ను గారవించిన గుణధాముండు రాడాయనే
వాని బాసి యోర్చే యేదాయనే
మునుపటి వలెనే కామాద్రిపతికిని నా మీదను కరుణ లేదే ||ఏమో||

## యమునా కల్యాణి-త్రిపుటతాళం

ఎవరికి దరమా విరహభారము సహించియుండగ మానినీ
వనజముఖి నను జూచి పల్లవివాడు నేడేమి జేసెనే
కనక చీర నొసంగను దలపుల మరుకలుమ్మల నేసెనే ||ఎవరి||
మంద మారుత మధుర వేగము పెంచి నాపై విసరెనే
చంద్రముఖి మందపవనులు యెంతో పెనగ సన్నించెనే ||ఎవరి||
వాల వెంకటశైల నాయకుడేల యిటు రాడాయనే
మేలి మెంపగ కామగిరిపతి కెట్టి కృప లేదాయనే ||ఎవరి||

## లలితపంచమరాగం-రూపకచాప్పు

ఏల యింత చలము చేసె యింతి నాతో తెలుపవే
....మెప్పు కిప్పుడు శేషశైల నగర వల్లభుండదేల ||ఏల||
కాయమెల్ల మరుని శరనికాయములకు గ్రుక్కైనే
ప్రాయమెల్ల పూల పాన్పు పాలు సేయ సమయ మొదవె ||ఏల||
తరుణి వినవే చిత్త మతని దలచి దలచి దలకెనే
యింపు మీర కన్నులతని కెదురు చూచి యలసెనే ||ఏల||
సరస కామశైలపతికి కరుణ గలుగ దాయనే
మరుని దురములోన నన్ను మరులు కొల్పిన వెంకటేశు ||ఏల||

## నాదరామక్రియ_ఆదితాళం

చెలియా చూచెను చక్రధరుని మంగళ దేవతా లలనా మనోహరుని
నొక్కిన మడుపు లిచ్చుచును బలు మక్కువ నుండుట ఒలరి మెచ్చుచును
చక్కెర మోవి నొక్కుచును వాని చెక్కిట గోరు లుంచుటకు నొక్కుచును
మోము నామోము చేర్చుచును బహుప్రేమతో ముద్దులాడుటకు నొచ్చుచును
॥చెలియా॥

ఎదనెద గదియించి మిలచి బాలమదనుని కేళి కూడుటకు పేరెంచి
వరకామగిరి పతి హితుని శ్రీ జలధిసుతా మహిళా సమన్వితుని
॥చెలియా॥

## సౌరాష్ట్రి-త్రిపుట

ఇటుల లక్ష్మీవెంకటేశుల నెదుటగా కనుగొనుచు చెలి
యచ్చట గదుక్కున తిరిగి వచ్చెను సంభ్రమమునా ॥ఇటుల॥

వచ్చి యలమేల్మంగ కలరుచు వందనం బొనరించి
హెచ్చుగ ముచ్చటాడక చూడకనే తనమోము వంచి ॥ఇటుల॥

ఊప్పు గాడ్పులు నిగుడ మదిలో నోర్పు లేకను
తల్లడిల్లుచు నేర్పు తోడను బలికె నపుడు నీరజాక్షి ॥ఇటుల॥

వింటివే యో చెలియరో వింటివే
వింటివే సఖియా నీ విభుడు నిన్నెడ బాసి
వెంటనే కలిమి వాల్గంటిని జేరెను ॥వింటివే॥

చక్కగా నన్ను చూడకునూ-నాతో
చల్లగా మాటలాడకను-దాని
చక్కెరమోవి చురుక్కున నొక్కుచు
మక్కువతో నిన్ను మనినైన తలచడు ॥వింటివే॥

తరుణి సారెకు జూచి చక్కఁ
వనమునకును తలమూచి-ఎంతో
కరముపుదుగ దాని కరము నా కరము బి
త్తరము గానిది నిన్ను గరిమెలో నెంచుచు ॥వింటివే॥

సరసోక్తులను గారవించి దాని
మరుకేళిలో సలరించి బాల
మరులు చెందిన కామగిరి పతిహితుడైన
వరవెంకటాచలవాసుని పగలెల్ల ॥వింటివే॥

క॥ అను పలుకులు తన చెవులకు
సునిశిత శూలంబులగుచు సొలయఁగ నా జ
వ్వని నెవ్వఁగ నొందుచు చెం
ఙను తిన్నగ నిలిచినట్టి తరుణితొ పలికెన్

## ఘంటారవం-ఆదితాళం

ఏలాగు తాళుదునే – ఇక నేనేమి సేతు ॥ఏలాగు॥

బాలామణి మదనుని బాధ కెట్లు సైతు ॥ఏలాగు॥

చిన్న నాట నుంచి వాని చెలిమి నమ్మి యుంటి
ఎన్నెలాడి మాటలాకు పలచెవని వింటి
మున్ను నే చేసినట్టి నోము ఫల మానుకుంబ
నన్నెడ బాయడని నే నమ్మితి వాల్గంట ॥ఏలాగు॥

అచ్చిక మచ్చి కలచే నాదరించే వాడు
మచ్చరాము బూని యిపుడు మా యింటికి రాడు
అచ్చోటనె మరులు మించి ఈసుతో నున్నాడు ॥ఏలాగు॥

ఏమో కాని వాని మనసింత కరుగ దాయ
కామాద్రీశు పదమాన కిలికి ఇది మాయ
శ్రీమంతుడైన వెంకటాద్రీశుడు
కాముకేళిని సన్నేలిన కరుణ లేదాయ ॥ఏలాగు॥

## మాంది_ఆటతాళం

ఏమి సేతునె చెలియా - నా సామిటు రాడాయ ॥ఏమి॥
ఆ లలనా బోధనలచే జాలములు నేర్చినాడె
చాల నమ్మి యున్న నన్ను చౌక చేసె నెట్లు సైతు ॥ఏమి॥
వేడుకలో వాడు నేను జోడు కూడి యండగను
చూడ చూడ మోడి చేసె చేడెరో యీ ఆడుజన్మం ॥ఏమి॥
ప్రేమ మీర మోవి నొక్కి కాము కేళి నన్నేలిన
కామ శైల వాసా హితుడాయెను కూడినట్లు చెసె ॥ఏమి॥

## ఎరుకలకాంబోది-ఆటతాళం

ఈ మేదిని జీవున కింత సంతాపము
ఏమి కారణ మొనరించెనో
నా మది కీవేళ జామొక యుగమాయె
భామ వెంకటాచలము సామి కౌగిట ॥ఈ మేదిని॥

సరసిజాముఖి నాదు సరసాకు రమ్మని
అమరగ కౌగిట నలిమి యావేళ
పరికించ ముత్యాల సరు లడ్డమా నని
గరిమ మీరగ పల్కి కమలజాక్షు నెడబాసి ॥ఈ మేదిని॥

మోము మోమున జేర్చి ముద్దులాడుచును నీ
మోము చూచినవేళ నేమొ నే నెరుగ

ఏమియు తోచ దిక్కేమి చేయుదునే
ప్రేమతో పల్కిన పీతాంబరుని బాసి ||ఏమి చే||

ముద మెదఁ బొదవగ నెవరె గదియించి
తుదమొద లెరుగక పెదవి నొక్కుచును
మదన కదనమున కసిదిన విభునిఁబాసి ||ఏమి చే||

దాన యిప్పుడు కామశైలవాసుని పాద
మాన నన్నెడబాసె నేనెట్లు తాళుదు. ||ఏమి చే||

## అసావేరి - ఆదితాళం

కలికిరో ప్రాణేశుఁ డలిగి యుండఁగ చూచి
చెలఁగుచు బ్రతికిన వారెంత వారో
కలకాల మతఁడు నన్నలరించి యీవేళ
అలరి యుండఁగ ప్రాణములు నిల్వనేరవు ||కలికిరో||

పాలు నీరునుఁ గూడి పరిఢవించిన రీతి
మేలిమి తోడ నన్నేలిన విభుఁడు
బాలరో యిపుడు నాపద్ద చేరక యున్న
వేళ కన్గాని తనువు విరియగ సాగను ||కలికిరో||

సఖియరో చంద్ర చంద్ర కళ రీతిని దాల్చి
యొకనాడైనను బాసి యుండని వాఁడు
ఒకవేళ నెదుట నిల్వక నందు చేరినంత ||కలికిరో||

తాను నేనను భేద మేనాటి కానాటికైన
పూనని వెంకటాచలవిభుడు

## ద్విపద_ఆహిరి

అని చెలితోఁ బల్కి యాకాశ రాజు
తనుజయై విలసిల్లు తరుణి కల్యాణి
అలమేలు మంగా మృగాక్షి వియోగ
మెలిమి సహించ లేక వందుర గాను
చెలగ కున్నట్టి మాసిన చీర కట్టి
తలపట్టు పెట్టి మోదము కిట్టి పెట్టి
ప్రియమెల్ల పోగొట్టి విరిచుట్టు కట్టి
భయమును మెట్టు నిర్భయత చేపట్టి
కెంపు లిడక మేటి కుసుమముల్ రాల
చప్పర కోళ్ళ మంచమున సొంపెడలి
తమిమించి శయనించి ధైర్యంబు త్రుంచి
క్షమియించి విలపిల్లి పలు తల్లడించి
వీణ వాయించక విరుల తండముల
వేణి యందుంచక వెలయ కస్తూరి
తిలకంబు పెట్టక తివిరి సారెకును
చెలుల చేపట్టక చిడిముడి పడుచు
మంచి మాటాడక మానిని యెదుల
నించుక చూడక యెలమియై నిండ
గంధంబు పూయక కనకభూషణము
లందంబు చేయక యలరు కన్నులను
కాటుక పెట్టక కర్పూర వీటి
పెట్టక పిక సమూహముల పిలువక
చిలువక షడియైన వెలదుల దంట
నిలువక కంటికి నిదుర పొందింప
కన్నంబు తినక శుకాళి కన్గొనక

వన్నె గైకొనక సుస్వరములు వినక
జాను కాదన కత్యాయాసము తోప
మౌనంబు పొంది నెమ్మది చింతఁజెంది
మదని బాధకు కంది మాటికి కుంది
పరిపరి విధమొంది భావము డింది
సరసంబు లాడుచు సఖుల నవ్వుచును
సొరిది కీరము చూచి సూద్యని గాంచి
హరియంచు గోవిందుఁ డంచును పిలుప
హరివచ్చె గోవిందుఁ డదె వచ్చెననుచు
కరమరుదుగ లేచి కన్నులు మూసి
సరసిజ దళనేత్ర జలదైకగాత్ర
వాసవనుతి పాత్ర పరమపవిత్ర
నా సామి రార నన్నలరింపవేర
కూరిమి మీర వల్కోరిక మీర
ఓరి నీకిది మెరపో దయాసార
సారె సారెకు నిన్ను సన్నుతింపగను
మారు బారికిఁ ద్రోచి మన్నింప వనుచు
కన్నులు తెరచి చక్కఁగ కనుంగొనుచు
చిన్నెలు మీరెడు చెలిమి సొంపార
కమలాయతాక్షి యా కమలను విడిచి
కమలనాభుండు నాకడ కేలవచ్చు
నని యెంచి ప్రలపించి హర్షము డించి
ఘనపల్లవోత్కర గ్రాస కషాయ
గళపిక వ్రజకాను కాకళి స్వనము
లలరంగ మిక్కిలి హా యని యేడ్చి
విరహంబు మితిమీర వేదన పొడమ
పరిపరి వ్యథ తోప పలుమూర్ఛఁ జెందె

వచనం :

ఈ లాగున మూర్ఛాక్రాంతులయిన బాలశిరోమణిని జూచి చెలు లేమను చున్నారు.

## శ్రీరాగం-ఆటతాళం

ఏమేమి సేయుదుమే - యీ వెతలాకు
ఏమేమి సేయుదుమే

ఏమేమి సేయుచ మీ మహితలమున
క్షేమెందు చూడ లేదేమందు నికమీద ॥ఏమేమి॥

పుడమిపై సతులు లేరా-నిత్యము
మగని పొందిన వారు కారా
దెడగులో పతి నొక ఘడియ చూడనందుకే
కడు శోకమున మునిగి బడలిన యీ సతి ॥ఏమేమి॥

అందరికని బాలా మాట్కి వెనుక ముందు తోచ దీ వేళ
మందగమన చిత్రమందు వ్రాసిన బొమ్మ
చందము పొందిన-అందుకు వెతచెంది ॥ఏమేమి॥

ఇల నేలాగున సైచునో యీ మదవతి
యే మందుడో లేచునో
చెలులాల మనకెల్ల తెలియదా వర కామాచలము
సామికైన తెలుసునో తెలియదో ॥ఏమేమి॥

## శంకరాభరణం-త్రిపుటతాళం

ఇంతగా చెలులెల్ల పలుకుచు
నింతిపదముల చిగురు టాకుల

కొంత తొడలం దరటి పొదలను గడియఁ జేసి॥
కలికి కుచముల పూలగుత్తులు వెలయ
భుజయుగముల మృణాలము లలర
చెక్కుల చంద్రఖండము లెలిమి నునిచి॥
కన్ను లందున కలువ రేకులు
చిన్ని మొగమున సరి జలంబులు
తిన్నగా కురులందు ప్రాచితీగ లునిచి॥
ఇంచువిల్తుని మాటికి ప్రార్థించి
జాబిల్లి ని నుతించి పూజించి
అనిల శుకాళి పికముల సేవఁజేసి
కామగిరి వల్లభుని మృదుపద
తామరసముల సన్నుతించిరి
రామ లభినవ నిఖిల జగదభిరామ లప్పుడు॥

వ. ఇట్లు సఖీజనరచిత శైత్యోపచారంబున తిన్నగా కన్నెలతో ఏమనుచున్నది.

## ఘంటారవం - ఆటతాళం

ఇక నేమి సేతునే యొక ఘడియైనను
సకలేశుడగు శేషాచలవిభుని బాయలే నిక
శ్రీమంతుడైన నా సామిని చక్కనిముద్దు
మోము చూడకయున్న మోదము పొందనే
మాటి మాటికిని శ్రీమన్నారాయణునితో
మాడలాడక యున్న మమతాలు నిలుపనే
కామాద్రి నిలయుని కరుణచే నా విభుఁడు
కాముకేళి నన్ను కలయక నుండితే

## నాదరామక్రియ_జంపెతాళం

పరమేశుఁ డిక నైన వచ్చునో రాడో - ఎ
వ్వరినైన నడుగరే వామాక్షులారా ॥పర॥

శకునంబు లడిగి హర్షంబు పొందెదను - మీ
రకలంక సిద్ధాంతులను పిలువరమ్మా ॥పర॥

సాముద్రికుడును చూచి సర్వలక్షణముల
ప్రేమతో పలుకు వారిని తేరే మీరు ॥పర॥

గద్దెడిగి నా మనసు కానంద మొనరింప
గద్దె చెప్పేవారి గరిమె రమ్మనరే ॥పర॥

## ద్విపద_శంకరాభరణం

అని యలమేలు మంగాంబిక చెలులు
కనుగొని పలుకుచు ఘనవిరహంపు
ననలోన మునుగుచు తేలుచు నుండ
బుధలోక వంద్యుండు భువన రక్షకుఁడు
సర్వేశుఁడగు శేషశైల నాయకుఁడు
సర్వంబు తెలిసిన సామి నాపు తను
మనసులో నలమేలు మంగను తలచి
ఘనమైన విరహాగ్ని క్రాగుట తనదు
దివ్యదృష్టిని చూచి తెలివకు నిపుడు
భవ్య సంతోషంబు పరగింప ననుచు
కమలాయతాక్షుఁ డా కములకు ననిచె
నమిత వేదనంచే నలమేలుమంగ
నను వాసి విరహాత్మాకిరంబంచు
మునిగి యున్నది దాని ముదము పొందించి

వేగ వస ్త్ర నటించు ప్రియములు పలికి
ఆ గజగామిని యానతిఁ బూని
చేలంబు చెరగున చెలఁగి బిగించి
కరమరుదుగ కట్టి కమనీయ మగుచు
నవరత్న ఘన కాంచనంబులచేత
నిరవందు చున్నట్టి ఎరుకల బుట్టి
కరమున బట్టి బంగరు పూల చుట్టి
తలమీదఁ బెట్టి బెత్తంబు చేపట్టి
కళఁ బుట్టి కనుఁబట్టి ఘనమైన పసిడి
మిసిమి కల్గిన రైక మించుగా తొడిగి
పసిమించ కస్తూరి పచ్చ కర్పూర
మగరు జవ్వాజిచే నందమై చాల
జిగ గల్గు గంధంబు చెలువంద గాను
మెయినిండ నలది కమ్మలు బాజు బంధు
లాణి ముత్యపు సరు లాదిగా కలుగు
సొమ్ములు ధరియించి సొబగు వహించి
కమ్మని విడెము మేల్కారమున నుంచి
మొగమున చిరునవ్వు మొలకలు వెలయ
నిగనిగ మను దేహదీప్తులు వెలఁగ
నలరు విల్తుని మదహస్తియో యనఁగ
కలిక కామునిచేతి ఖడ్గమో యనఁగ
ముదముతో తగు జగన్మోహిని యనఁగ
పొదలుచు కదలుచు పోడిమి మీర
సొక్కుచు సోలుచు సొబగు చూపుచును
నిక్కుచు నీల్గుచు నేప్పు కల్గుచును
కులుకుచు బెళుకుచు నలరుచు చాల
చెలువొంది తిరుపతి చేరె నావేళ

## సౌరాష్ట్రి - త్రిపుటతాళం

వచ్చె నెరుకో యెరుక యనుచును వారి జాతులు చూడగా
పచ్చపెట్టని తేజమో యని పౌరులును కొనియాడగా ॥వచ్చె॥

కాళ్ళ నందెలు గజ్జెలును ఘల్లు ఘల్లు మనుచు నటింపగా
వేళ్ళ నుంగరములు థళక్కని వెలుగుచును రాజింపగా ॥వచ్చె॥

జోస్య మాడి నృపాంగనలు తన సొగ చాల నుతింపగా
మాన్య నౌసగెద మింటికని రమ్మనుచు జను లర్థింపగా ॥వచ్చె॥

మాటి మాటికని బాలకుని పలు మక్కువతో ముద్దాడుచు
ఆట పాటల నాదరించుచు వాసిగను మాటలాడుచూ ॥వచ్చె॥

మేటి పక్కిడసంబునను సయ్యాటలను తోలలాడుచూ
కోటి సంఖ్యల నతులగని తనకొడుకు కన్నము వేడుచూ ॥వచ్చె॥

పొలుపుగను శిరమునను గవిలేటి బుట్ట కరమున పట్టుచూ
చెలిమి మెరగ ఎరుక వినుమని చెలుల తగ నరికట్టుచు
తిరిగి కామాచలము సామిని తలచి అడుగులు పెట్టుచు ॥వచ్చె॥

## లలిత - ఆటతాళం

ఎరుకా చెప్పేవారమే అవో అవ్వ
ఎరుకా చెప్పే వారమే
ఎరుకా చెప్పే వార మరుదుగా వినిన ॥ఎరుక॥

పతిలేక మెలగుచు చతురాస్యునకు ముద్దు
సతినై చెలంగు భారతికి చెప్పిన మంచి ॥ఎరుక॥

అచ్చ మెచ్చగ నిచ్చ నిచ్చలు కోరక
మచ్చకంటి యైన లచ్చికి చెప్పిన ॥ఏపక॥
వర కామగిరి రామేశ్వరుని సుందరియైన
గిరిరాజ తనయకు సరుదుగ చెప్పిన ॥ఏపటిల॥

వచనం:

ఇత్తెరగున వచ్చు ఎరుకుల సానిని గనిన ప్రజను చేయుచున్నారు.

## శంకరాభరణం - ఆటతాళం

ఎందుండి వచ్చెనా ఎరుక లా - డి ని
చందము చూచితే ॥ఎందుండి॥

సరసతి కిన్ని చిన్నెలు మెచ్చునా
పార్వతి దీని సరి యనవచ్చునా
మరుఁ డిట్టి వేషము పొందెనో - అల్ల
పరమేష్ఠి యీ వన్నె పెంచెనో ॥ఎందుండి॥
హరి ఆడు రూపము నందెనో ఆ
హరు డిట్లు చాతుర్య మందెనో ॥ఎందుండి॥

ధరణి లోపల నిట్టి సతి లేదో - దేవ
తరుణీ మణులలో నిది కాదో ॥ఎందుండి॥

కరమరుదగు నింతటి వాడూ
కామగిరి సామి కైనను తెలియదు ॥ఎందుండి॥

తే॥ ఇటుల వచ్చిన ఎరుకల వింతి నిప్పుడు
చూచి తలయూచి మదిమెచ్చి చోద్యమంది
మానవతులెల్ల నలమేలు మంగ తోడ
పలికి రద్భుత నిరుపమ ప్రౌఢి తోప

## నాదరామ్రప్రక్రియ-ఆటతాళం

ఎఱుకల సాని వచ్చినది - దేవ
తరుణుల కన్న చాల హెచ్చినది ॥ఎరుకల॥

శిరసున బుట్ట పెట్టినది - తన
కరమున బెత్తము నెలమి పట్టినది
కురులాకు పూవులు చుట్టినది - బం
గరు కమ్మి చేమించు చీర కట్టినది ॥ఎరుకల॥

దానికి తగు చక్కదనము ఇట్టి
మానిను లము మే మెన్నడు వినమూ
లలనారో నీవు రమ్మనవే దాని ॥ఎరుకల॥

పిలువగ మేలైన చెలుల బొమ్మనవే
పలికిన పలుకులు వినవే కామా
జలపతి పదమాన నిపుడు కనుగొనవే ॥ఎరుకల॥

## నాదరామక్రియ_ఏకతాళం

ఈ రీతిని పలికిన నారీమణుల నెల్ల
సారెకు కనుగొని సరసత ననియెన్ ॥

తలచిన తలపులు తెలియగ చెప్పెడి
చెలియలై మీ రలరుచు చూచీ ॥

ఏ వూరే దేశ మేజాతి యే గుణ
మే విధముల తెలిసిందు రమ్మనరే ॥

క. లలిమీరగ నిట్లు పలికిన
అలమేల్మంగా మృగాక్షి యానతి యిచ్చెన్
చెలు లెల్ల జోయి యెఱుకల
లలనం గని పలికి రపుడు లాలిత ఫణితిన్

## మధ్యమావతి - ఆది

మగువా నిన్నలమేలుమంగా రమ్మనెనే
సొగసూ మించినా నీదు జిగి వెల్ల వినెనే
అంతటి తరుణి లేవనుచు పలికెను
న్నెంతో కొండగా జేసి యిప్పుడు పిలిపించెను
ఈలాగు పలికిన లీలావతుల తోడ
బాలా శిరోమణి ప్రమద మొంది
భావించి తక్కిన పనులెల్ల మాని
ఈవేళ రావో ఎరుకల సాని
వేవేగ శేషాద్రి విభు పంపగాన
నీవు రాకున్న నీ నేర్పు మే కానా
ఈలాగు పలికిన లీలావతుల తోడ
బాలా శిరోమణి ప్రమద మొంది
హేలావతుల తోడ నాలాప మొనరించు
చాలనా రహిత ఘంటాల మసగ
లీలాగతులఁ బూని లోలాలి లసమాన
నీలీలాకశ్రేణి నివుడు కొనుచు
వేలాతి గానంద జాలంబు నిధిమించు
లోలాడుచును వచ్చి మేలిమి గను
నిరుపమ చిరరత్న నవరత్న నిచయ
రచిత మగుచు కమనీయ తపనీయ
హరితదీప్తి మహిత మయినట్టి అలమేలు
మంగ నగరికని ప్రవేశించి కూర్చుండె గరిమ మీర.

వచనం:

ఇట్లు వచ్చిన ఎరుకలసానితో నలమేలు మంగాదేవి ఏమనుచున్నది.

## మధ్యమావతి-ఆదితాళం

ఎందుండి వచ్చితివే ఎరుక సాని - నీ
విందు వచ్చినది మా కంద మయ్యాని ॥ఎందుండి॥

నీ రాజ్య మేది యేది నీ వంశ మేదే
పూరు పేరేమి నీ పేరు పెంపేమి ॥ఎందుండి॥

పిల్ల లెందరు నీకు విభు డెందున్నాడు
పల్లవాధరి నీవు పలుకు నాతోడూ ॥ఎందుండి॥

వచనం:

ఇట్లు పలికిన అలమేల్మంగా దేవితో ఎరుకలసాని ఏమనుచున్నది.

## ఆహిరి-ఆటతాళం

సకల దేశంబులు సంచరించే వారి
కొక దేశమని ఎట్లు నుడువుదురే
అకలంకులైన స్వయంభువులు
సుకరత్వమున నాదు సుతు లందురే

ఊరడిగితివి యీ పూరే మా పూరని
సారె సారెకు నెల్ల జను లందురే
పీరు వారందరు వెంకటరమణుని పేరే
నా పేరని తెలియుమదే

ఇలమీద బలుమంచి ఎరుక చెప్పేవార
కులమే నా కులమని తెలుపుదురే
విలసిల్లు శేషాద్రి విభుడు నా ప్రియుడని
వెలుగుచు జనులెల్ల పలుకుదురే

వచనం:

కంచి, కొల్హాపురి, ఆనందపురి, కాళహస్తి, కాశి, శ్రీశైలాద్యష్టాదశ పీఠంబుల నెఱుంగుదునే. తర్క వ్యాకరణ వేదాంత మీమాంస పురుషవశ్య స్త్రీ వశ్య రాజవశ్య .... .... శకున జాతక సాముద్రికాది చతుష్షష్టి విద్యా విశేషంబుల నెరుంగుదునే కుంతి సరస్వతీ లక్ష్మీ పార్వతీ శచీ విలాసంబుల నెఱుంగుదునే భామా ?

## ద్విపద—ఆరభి

బంగాళ లాటి నేపాళ వరాటి
వంగాంగ కరహాటి వర మహారాష్ట్ర
మాళవ కాశ్మీర మగధ కాంభోజ
గౌళ సన్మలయాళ గాంధార చోళ
కేరళ కోసల కేకయ భోజ
సౌరాష్ట్ర పాండ్య పాంచాల కళింగ
ద్రావిడ చేది విదర్భ కర్ణాట
సౌవీర కురురాది సర్వదేశములు
తిరిగి మానవులకు దేవసంతతికి
పొందుగా నే నెఱుక చెప్పెదనే

## నాదరామక్రియ—అటతాళం

గద్దెడుగ నేదండి - అవో జంత గద్దెడుగవే నీవు
కామిని మదిలోన గద్దెగాదిది వెన్న ముద్దని తెలియుచు ॥గద్దె॥

కుల మడిగెద వెందుకు వో ఢుంఢీ మాతలము చింతల చెంతకే
కులమేమి తలమేమి తెలివి మీరంగ లోకంబుల నెల్ల తిరిగిన
బలహీంత కారిని ॥గద్దె॥

సుస్వరసులు పూనక నిరంతరము
ఇచ్చలో కృప మానక
ఒచ్చిన మీదటి హెచ్చుగా భాగ్యము
వచ్చేడు సట్లుగా వచ్చు కుచ్చేద నిక మంచి
నేమము కై కొనగా నిత్యంబును
ప్రేమ తోడుత నివిగా
నేమాట కామాక్షి భామని పదమాన
భామలో నా మది పాటించుచున్నది ॥గద్యె॥

వ॥ కుందనంబు .... .... వే దుండి
అందముగా నన్ను చూతవే దుండి
నీ దెంప మందున్న కోర్కె చెప్ప నా దుండి
సుందరమైన వెత్తము వట్టనే దుండి
బింపె డాణి ముత్యాలు తెప్పించవే దుండి
అ మందమయిన చింత విడువవే దుండి
అరవింద సదృశమయిన నీ చెయ్యి చూపవే దుండి

వచనం:

ఇట్లు తన దైవంబుల తలచె నటు—ఎటువలెను

## ద్విపద—ఆరభి

శ్రీ కామగిరివాస శివరామలింగ
లోకనాయక సర్వలోకాధివాస
వెంకటాచలనాథ విరూపాక్షలింగ
సంకట హరణ శ్రీ చెళ్లపిళ్ళరాయ
కాలభైరవ దివ్యకాశి విశ్వేశ్వర
కాళహస్తీశ జగన్నాథ సామి

నింటికే. అడవారికే. మొగవారికే. పొరుగువారికే. చుట్టాలకా. పక్కాలకా. అల్లుండ్లకా. ఆడబిడ్డలకా. కొడుకులకా. కోడళ్ళకా. అంటా అడుగుతుండావే భాగ్యశాలి. ఆ మేలు అత్తింటికి గాదు. పుట్టినింటికి గాదు. ఆడవారికి గాదు. మొగవారికి కాదు. ఇరుగువారికిని గాదు. పొరుగువారికిని గాదు. చుట్టాలకుగాదు. పక్కాలకు గాదు. ఆలుబిడ్డలకు గాదు. కొడుకులకు గాదు. కోడండ్లకు గాదు. వింటివా భాగ్యశాలి. అవో జంట. మరి ఒక కార్యంబున అడుగుతుండావే దుండి. నీవు తలచిన కార్యంబు ఫలమౌతుందా అంటా దేవళ్ళు వచ్చి నిజంబుగా చెప్పుతుండాలే దుండి. అదేవాళ్ళు ఎవరో, ఎట్లా ఉంటారో, ఏలాగున ఉంటారో ఎట్లాదో అంతా నీ మనసున అనుకుంటావే దుండి. ఆ దేవర కామగిరి అనేది. ఒక కొండ కద్దు. ఆ కొండమీద మహారమ్యమైన ఒక తావు కద్దు. ఆ తావు నందు అయిదు మొగాలు కలిగి, అయిదు కోశాలుతో మెలగి, అయిదు క్లేశాలుతో నలిగి, అయిదు భూతాలుతో వెలగి, అష్టమ దాసులను తిరస్కరించి, అష్టైశ్వర్యా శ్వర్యాల ననుభవించి, అష్టాంగముల వహించి, అష్టదిక్కులను పాలించి, సప్త వ్యసనాలను విడిచించి, సప్తాంగములను సంరక్షించి, సప్తలోకాల నతిక్రమించి, సప్తాశ్వమండలం భేదించి, సప్తప్రాకారముల వెలిగించి ద్వంద్వరహితుండై, అజ రామరుడై, అభావాభావుడై, అప్రమేయప్రాప్తుడై, నిత్యశుద్ధబుద్ధ నిరంతరా ఖండ సచ్చిదానంద పరంజ్యోతి స్వరూపుండైన రామేశ్వరుం డెందు వచ్చి నీవు తలచిన కోరికె సఫలమౌతుందా అంటా పలుకుతుండాదే దుండి. యీ కార్యము పండో కాయో, అయ్యానో గాదో, టక్కో టమకో, యదార్థమో, వినోదమో విలంబమో ఉంటా అనుకొంటావే దుండి. యిది కాయ గాదు. టక్కు గాదు, వినోదం గాదు. విలంబం గాదు. నీ కార్యము ఏమవుతుందా ఓ జంట. అవో దుండి. యిప్పుడొక్క కోరికె కోరుతుండావే జంట. నీ మనస్సుకు తార్కాణ ముగా తెలిపెదనే దుండి. యిగో ఆడవారంటే చెయి చూపదు. మొగవారంటే గడ్డం చూపుదు, మొగుడంటే వొడ్డు చూపుదు. అలమేలుమంగాదేవి నీ వెందు కడిగితివంటా. దేవళ్ళు వచ్చి నాతో నిజముగా చెబుతుండారే దుండి. ఆ పెని మిటి ఎవరంటే యీ శేషాచలమున కధిపతి అయిన వెంకటరమణుడు. అట

వెంకటాచలరమణుండు నన్ను విడిచి లక్ష్మిని కూడి సరససల్లాపంబులు సేయుచు యుండు రాడేమని చింత చేస్తావే యుండి. ఇగో నే పలికిన పలుకులు దబ్బరకాదు. నీ కార్యమెల్లా మేలౌతుండాదే ఇంక. ఒండె రొండె మూడె నాల్గె అయిదంటె అయిదు కార్యాలు గావు. అయిదు యుగాలు కాదు. అయిదు నెలలు గాదు. అయిదు దినాలు గాదు. అయిదు ఝాములు గాదు. అయిదు ఘడియలలో నీ మగడు నిన్ను కూడుకుంటాడే యుండి. అహో ఇంత.

## పున్నాగతోడి-ఆటతాళం

మాట సూడు ఓ దంటె - నామాట సూడు నీవే
సాటిలైనను మేలైన రతనాల మాట నిస్తివి కానా ||మాట||

సిరిదేవి నీవాక సరివచ్చెద ననుచు బం
గరు కమ్మి చీర సింగారముగ నొసఁగెనా
కమ్మ విల్తుని సతి సమ్మతి జెంది కై
కొమ్మని పంజల కమ్మల నిచ్చెనా ||మాట||

గిరిసుత ననుజూచి కరుణించి మణులచే
మెరసిన ముద్దు టుంగరములు నొసఁగె నా
భారతి నను మెచ్చి మేర మీరిన పద
హారు వన్నెల బంగారు సొమ్ముల నిచ్చెనా ||మాట||

ఎరుగని వారి ముందర చెప్ప రాదు సుం
దరి నాదు నుడి కామగిరి పతికె తెలుసు ||మాట||

## సౌరాష్ట్రి- త్రిపుటతాళం

మేలిమిగ యీ లాగున మేటి ఎరుకల చెలిని గని
అలమేలు మంగా దేవి మదిలో చాల నమ్మి
నీవు పలికిన పలుకు లెల్లను నిజములై నా సామి వచ్చితే
నీవు కోరిన వన్నియును నే నిత్తు సఖియా
ఇపుడు కొంచెము నొసగెదను ఓ యింతి
కై కొమ్మనుచు నా యింతి

అపరిమిత సంతోష పరవశయై చెలంగి
పసిడి సొమ్ములు పట్టు చీరలు మిసిమి కలిగిన పైడి రవికెలు
శశివదన సంభ్రమము మీరగ నొసఁగె నపుడు
కలికి యానతి పూని ఎరుకల చెలియ మునుపటి వలెనే
శేషాచలము దొరయై సిరిని గూడెను చెలువు మీర

వచనం:

ఆ సమయంబున పురజనులు తమలో తా మే మనుచున్నారు,

## మధ్యమావతి-ఆటతాళం

చూడ చూడగ వేడుకౌ నిది పొడమిగ మీరందరును గుమి
గూడి ముదమున చూడరె ఓ వేడెలాల మహాద్భుతంబిటు ॥చూడ॥

ఎరుక వేషము పూనిన హరి తన తరుణి కెరుక వచించె ననుచును
వరుణునకు తెలుపగను పోయిన తెరగునను రవి యస్తమించెను ॥చూడ॥

వరుణుఁ డా బెడగైన నుడి విని వనజహితునకు నెలమి అరుణాం
బరము లుడుగ చేసెనో యన సరస సంధ్యా రాగ మొదమెను॥చూడ॥

ఆడు రూపము బూని యుండిన హరి పర మానందమునను
చూడ వలెనని వచ్చెనో యన నాడ కొపటు తిమిర మొటపెను॥చూడ॥

మనల కభిమత సిద్ధి కలమేల్మంగ విష్ణు పదంబు భక్తిగ
కుసుమముల పూజించెనో యన కొసము మీరగ తార లొసరెను
॥చూడ॥

మగని బాసిన మేలి అలమేల్మంగపై దండెత్తి వచ్చిన
చిగురు విల్తుని గొడుగు పోలిక చెలఁగి చంద్రుఁ డుదయ మొందెను
॥చూడ॥

## ద్విపద—సావేరి

ఆ వేళ మనసిజుండను మహారాజు
వేవేగ మందోష్ణ విమలోదకముల
జలకంబు లాడి కాంచన మయచేల
మేలిమి పూని సొంపెసఁగ కస్తూరి
తిలకంబు నుదుటను దీర్చి నవరత్న
కలిత కిరీటంబు కరమర్థిఁ దాల్చి
జాళువా కడియముల్ సరసఁ బూని
ముత్తెపు సరు లురమున సవరించి
మత్త కాశినులు సమ్మదములో మించి
సరస శాల్యన్నముల్ సద్యో ఘృతంబు
పరిపరి విధముల భక్ష్య భోజ్యముల
సమరమౌ పళ్ళెర మందు వడ్డింప
సమధి కానందాతి సాంద్రుడై యపుడు
భుజియించి సంతుష్టిఁ బొందింప నీట

నిజహస్త పాదముల్ నేప్పై కడిగి
తాంబూల మొనరించి తరుణ సుధాంశు
బింబాస్యపై నీల వేణి యైనట్టి
రతితోడ మలయా నిలంబుపై నెక్కి
పతిలేని యామినీ పతి వెంట గొలువ
సలలితుం డగుచు వసంతుని చెలువ
మలరంగ ముందర నరుదుగ నడువ
కలకంఠ నికరము ల్కాఠ సూక్తి నుడువ
బలు శివితో కేకి పంక్తి నటింప
ఘన మిళింద కదంబకము సీత్కారింప
చనువున రాజహంసంబు సన్నుతింప
శుకములు చెలరేగి సారివి కీర్తింప
సకల సన్నాహంబు సరవి దీపింప
కసులటుల విల్లు కదమి ధరించి
తుమ్మెదలను నారి తోన సంధించి
అమదైన విరికోల లరసి సంధించి
గురువిక్రమంబు .... .... ....
విరహాల కెల్లను వెతలు పుట్టించి
సరసుల మీదను చలము సాధించి
ముందుగా భట సంఘముల నడిపించి
ఎందు చూచినను తా నెలమి రాణించి
పొగరు మీరగ భుజముల నప్పళించి
రగవొంది సింహ నాదం బొనరించి
మరిమరి అలమేలు మంగపై నపుడు
కరకరి బాణముల్ ఘనముగ వేసె

వచనం:

ఇట్లు మదన విశిఖ దోహూయమాన మానసయై యలమేలు మంగాదేవి ప్రాణప్రదయైన కళావతితో నే మనుచున్నది.

## పున్నాగ-ఆటతాళం

ఈ వేళ నే తాళ జాలనే - చెలి
ఈ వేళ తాళగ ఇంతి
నేనేమి సేత భావించి చూచిన
ప్రాణేశుఁ డెందు రాడే ॥ఈ వేళ॥

వంట కోయి లెల్ల కూయగా - సఖియ
తుంట విల్తుడు శరము వేయగా
మింట చంద్రుడు కనలంటి వెన్నెల గాయ
మింటి మారైన యట్టి మలయానిలము డాయ ॥ఈ వేళ॥

అళులు ఝుం ఝుమ్మని మోయగా అల్ల
చిలుకలు గూడి రొదలు చేయఁగా
చెలియరో నా చిత్త మెలమి చంచలమాయె
లలిమీర నా ప్రాణములు నిల్వలేవాయె ॥ఈ వేళ॥

విరహము నేనెట్లు సైతునే - మోహ
భరము నే నేలాగు తాళుదునే
తరుణిరో వెంకటగిరి సామి రాడాయ
కరమరుదుగ కాపగిరి పతి పదమాన ॥ఈ వేళ॥

వ॥ మరిన్ని ఏమను చున్నది.

## ఆనందభైరవి_ఆటతాళం

చలము చేసినాడట చెలియరో వినవె
తొలి జన్మముల నోము ఫలమేమొ గదవే ॥చలము॥

నాటి కినుక మది నుంచెనో ఏ
నాటి బోటి గారవించెనో - చిన్న
నాటి మక్కువ మరపించెనో నా
నాటికి తమి పుట్టించెనో
మాటిమాటి నన్ను చూచి నట్టైన
మేటి వధూటి నీపని మంచి మాటాడు కదవే ॥చలము॥

కులుకు గుబ్బల గోరులుంచెనే - దయ
చిలుకగ నన్ను లాలించెనే - ప్రేమ
తొలుకఁగ వలఁచి వలపించునే - ముద్దు
కులుకగా నన్ను కౌగిలించునే ॥చలము॥

వెలఁదిరో నా పాలి కులదైవము నమ్మి
తలఁచి తలఁచి నేను వలఁచె గదవే
మరుడు నాపై శరము లేయగా
నిరంతరము చిక్కులు రొదచేయగా ప్రియుడు ॥చలము॥

కిరకిరి కడగంటి చూపెగా - కామగిరి
వడఁదిటు నుదుట వ్రాయగా
మరుకేళిలో నేమరు నన్నేలిన విభుని
వరవెంకటాచలవాసు రమ్మనవే ॥చలము॥

వచనం:

ఇట్లు పలుకుచున్న అలమేల్మంగను చూచి కళావతి ఏమనుచున్నది.

సీ॥ ఇల ననంగుఁడు తుంట విలుఁదాల్చి యంటిన
కందు తూపుల వాఁడు సుంద రాంగి
చంద్రుండు సంతత క్షయరోగ యుక్తుండు
దోషాకరుండు ఓ తోయ జాక్షి
అల వసంతుఁడు చూడ ననిశంబు నుండక
యొక సమయంబున నుండు నబల
మందమారుత మెంచ దందశూకంబుల
కాహారమైనది యలరు బోఁడి

తే॥ కలికి పికముల వనవాస మశుల నెంచ
మధుపములు చిల్క గములు రామాంఘ్రి
భజన శరణములు మేటి యంచలు పరమ హంస
లిటుల నుండగ వెరలు నీ కేల చెపుడు.

సీ॥ మన్మథుం డంటివే మహిలోన
మంట పాలయ్యెనో మంగ ళాంగి
చంద్రుఁ డంటె వ్యాసతపంబు గురుశాప
వహ్ని పాలయ్యెనో వన్నె లాడి
మాధవుఁ డంటివే మసలుచు వనమందు
పుష్పలావికుఁడయ్యె పువ్వుబోణి
తెమ్మెర లంటివే తెలియక యొకమూల
పడియుండు నట్లాయె పంకజాక్షి

తే॥ దొరకు మృతి కల్గె మంత్రులు ధరణి లోన
నుండియును నుండనట్లైరి దండి తేరు
మూలఁబడె మృత్యు లెల్ల నిర్మూల మైరి
కలికి యా చింతలి సుమంత కలుగ దమ్మ.

కం॥ అని పలుకుచు నలమేల్మం
గను కనుగొని కనికరమున కర మరుదుగ నె
మ్మనమున కానందంబుగ
ఘన మధు మృదు వచన రచన కలుగ ననియెన్

## నీలాంబరి_ఆదితాళం

బాలా నీ కిట్టి చింత లేలా - నే నుండఁగాను
బాలా వగవాగ నీకు మేలా - ఈ వేళ ముద్దు ॥బాలా॥

వినవే నా మాట మంచిదనవే చక్కఁగ నను - క
న్గొనవే విభుని తోడి తెమ్మనవే పొమ్మనవే - ముద్దు ॥బాలా॥

లచ్చితో కూడ విభుని తెచ్చి కాన్కఁగా నీకు
ఇచ్చి చెలులలో నెల్ల హెచ్చి యుందునే చిన్ని ॥బాలా॥

కామగిరీశు కృపచే భామ వెంకటాచల
ధామ రమ్మని పిలిచి ప్రేమతోడ తెచ్చెద ॥బాలా॥

అంత పర్యంత మిటు చింత జెందకను - ఓ
కాంత! నెమ్మది నుండు మింత లోనె వచ్చెద ॥బాలా॥

తే॥ అనుచు నలమేలు మంగాంబ యాజ్ఞ బడసి
చని రమాధీశు పరమేశు సత్కృపా
వేశు రవికోటి సంకాశు వేంకటాచ
లేశు కనుగొని పలికె నయ్యిందు వదన.

## ఝుజావంతి_ఆది

మా సతి మేలుకోరా - మంజులాకారా
భాసురాంగ శ్రీ వెంకటశైలనివాసా! చిద్విలాసా ॥మాసతి॥

కన్నెరా చిన్నారి చెలులలో మిన్నరా
వన్నె లాడి వయసున చిన్నరా
వయ్యారి గుణ సంపన్నరా ॥మాసతి॥

వినరా ఆ చిన్నెలన్ని నేనెన్న జాల నిక
నిన్ను నమ్మినది రా
నన్నెదురు నంచ విన్నవించితి - ప్ర
సన్నుడవై యున్న ప్రేమను ॥మాపతి॥

న్యాయమా పూపోజి నిపుడైన వాయనూ
విని సైచుట కిది పాయమా
నిలుపరాని పలు వలపు పాయమా - చెలికి
మరుడేయ కాయ మది కాయమా ॥మాసతి॥

ఇక మరలేల రా రా
తోయజాక్షి తాళ జాల
దివ్యేడ పాయరాని మార్మితో సతతము ॥మాసతి॥

వలచెరా నీపే ప్రాణ మనుచును
తలచెరా తమక మతివ మనసు
కలచెరా మోహంబున నిన్ను
పిలిచి రమ్మెనరా ॥మాసతి॥

ఆ లలన నెలమి రతికళల గలిసి
బలు సొలసి వెలయ పేరా
చెలిమి మీర శేషాచల నాయకా
కలిత చరిత కామాచలవతి హిత ॥మాసతి॥

ఫరజు:

నా సామి మా సుదతీమతి నిన్ను బాసి తాళ లేదు రార ॥నా సామి॥

పలుమారు మా వన్నెలాడి తలిరు విల్తు బలునేడి
తలయుచు నినునేడి నందుకు చెలిమివి విడనాడి
కులుకులాడి వలపు పాడి పలుకుల కలరి
మోడి సేయ పాడి గాదురా ॥నాసామి॥

కలువ రాయని కాకా కలిమిటారి నిల్వలేక
చెలువుండ నీరాక పినపు తలచర ఇందాక
చిలుకమూక లెదుట ఢాక చిలుకల
కొలికి కలికి అలికి బెళకు చున్నది
అలుక బూనక అలివ నేలు
మమిర గుణాలవాల శేషాచలం నాయకా ॥నాసామి॥

## పూర్వి-ఆదితాళం

జాల మేల రారా నాసామి
మేలిమితో నలమేలుమంగ నిపు డెలమి
దలంచ వదిపేల-ఈవేళ జాగేల ॥జాల॥

సారస లోచన సారెకు మది పే
సారగ కనుగొనవేరా ఇది మేరా తమి మీరా ॥జాల॥

మానవతి మది మానసమున నిన్ను
మానదు నికనైనా చెలితోనా ఘనమైనా ఈ ॥జాల॥

కాముని కేళిని కామిని నేలర
కామజనక శ్రీ శేషాచలధామా నుతనామా ॥జాల॥

సీ॥ అనియిట్లు పలికిన ఘనకళావతి పాట
విని గుండె ఝల్లన వెరపు గదుర

ఘడియ కొ్త్త నటించు గరిమెతో పలికి

యిక్కడ జనమెల్లను గడిపి చనుచు

కమలతో ననియె నా కమలాయతాక్ష

డీ వేళ నలమేల్మంగతో నన్నుఁ గూడి

జాగు చేసితి నీదు సన్నిధి నిఁక మీద

నీపైన వచ్చి యా నెలత నెలమి

గారవించి నయంబున నూరడించి
దాని నన్నును గూర్చి సన్మాన మొసఁగ
నాల్గు దివసంబు లందుండి నదత తోడ
వత్తు వనుచును సమ్మతి పరచి యప్పుడు

## శంకరాభరణం—త్రిపుటతాళం

సొగసు మీరగ వెంకటేశుడు
జిగి మిగుల లక్ష్మి సమన్వితుం డగుచు
దివ్య తురంగ మారోహణము చేసి
భూరి భేరి పటహ తూర్య గభీరము ఘోష కొలువగ
సార చంద్ర జ్యోతు లధిక చ్ఛవిని వెలుగ
వంది మాగధ జనులు వరదః ము
కుందః లక్ష్మీరమణః హరిః గోవింద యనుచును
పొగడగను ముదమొంది రాగ

అంతలో తనచెలి కళావతి హరి సిరితో చనుదెంచె
ననుచును వింతవింతగా వలుకగా విని వెతలు చెంది
కలికి యలమేల్మంగ చెలులను కని కవాటము వేయుమనగను
వెలదు లారీతి చేసిరి వేగముగను

## నాదరామ క్రియ—జంపెతాళం

అలమేల్మంగామణి నే వచ్చితి అలయుచు వాకిలి తీయవే
చెలువుడ నీవగలెల్ల తెలిసెను నిలువక నటు పోవోయి ॥అలిమే॥

దంతి గమన నిను చేపట్టిన మాధవుడను వినవే భామా
వింతగ మాధవుడైతే వనముల వెలయింపగ పోవోయి ॥అలమే॥

నక్రము చంపి గజేంద్రుని గాచిన చక్రధరుడనే భామా
చక్రధరుడ వైతే ఘటముల నిర్వక్రిత చేయుము పోవోయి ॥అలమే॥

కిరమరుదుగ జగముల పోషించిన ధరణీధరుడనే భామా
ధరణీ ధరుడవైతే భూతలమును ధరియింపగ పోవోయి ॥అలమే॥

మహిత పరాక్రమమున మించిన లసదహి దమనుడనే భామా
అహిదమనుడవైతే హరికిని వాహన మౌదువు పోవోయి అలమే॥

పరిపరి విధముల జనులెల్లను నను హరి యందురే వో భామా
హరివైతే రఘువర కార్య ధురంధరత పూను పోవోయి ॥అలమే॥

మదవతి వినవే మారీచోద్ధతి మర్దనుడనే వో భామా
అదయత నా విధమైతే వంటలు చక్కగ చేయగ పోవోయి ॥అలమే॥

సారసలోచన సంతత మర్జున సారథినే వో భామా
సారథివైతే జలచరములను విచారించగ పోవోయి ॥అలమే॥

బుధులు నుతింపగ సతతము వెలసిన మధుమథనుడనే భామా
మధుమథనుడవైతే మద్యము నమ్మగ వేగమె పోవోయి ॥అలమే॥

రమణీమణి నిన్నేలిన వెంకట రమణుండనే వో భామా
రమణుడవైతే దయ చిలుకగ నను రక్షింపంగ రావోయి ॥అలమే॥

కం॥ ఏ కరణి పలికె యూ పతి
వాకిలి నటు వెరచి యన్య వనితా సంభో
గాకులితగాత్రుఁడైన హృ
షీకేశుని జూచి పలికె చిత్తం బలరన్

## ఆరభి—ఆదితాళం

ఇన్ని చిన్నె లెవరైన చూచితే యీలాగు నైతురు సామిగా
ఎన్నాళ్ళో విను వనమున వేటాడగ తిన్నగ పోతే ఇన్ని తెచ్చిన్నెలా

వేటాడితే బలు గాజుల నొక్కులు నాటియున్నవి పూల తక్కులు
పోదలో వనమున కేలికె పత్రము మాటికి తగులం జీరెను చిత్రము
॥ఇన్ని॥

జలజనయన నీ తనువున గంధము చెంగు మున్నది చూడగ సందము
లలన వినవే యుప్ప దంతుల రకములు వెంయుచు నున్నవి ॥ఇన్ని॥

నిగనిగమను నీ కనుగవ అందును నిదుర దూగుచున్నది ఏమందును
జగముల కపటగ నే వేటాడగ జాగర మొదవెను తగ దీ యాగడ
॥ఇన్ని॥

పరిగంటు పచ్చడమున పసుపంటిన చందము
తురగము విప్పగ సంపెగ పువ్వులు ధూళి తగిలిన నట్లు కనపడెవపుల
॥ఇన్ని॥

మునిని దురము లోనను సేవ సేయక మన్నింపు వెంకట గిరి రాయ
వర కామాచలపతి పవమాన సుసత నిన్నేలుదు బాగా ॥ఇన్ని॥

## కంఘావతి—ఆదితాళం

మదవతి వినవే ప్రమాణము చేసెద
ముదము నొందుచు నీవు మదిలోన మెచ్చగ ॥మదవతి॥

చలమున దావాగ్ని జ్వాలలో దూరెద
జలధిలో మునిగి నిప్పులు గండు మీరెద ॥మదవతి॥

సింహముఖము నైన చేరి నే నుండెద
గహ్వర మందైన ఘనతతో నుండెద ॥మదవతి॥

భామరో నేపారే పామును పట్టెద
వేమరు కామాద్రి విభునైన ముట్టెద ॥మదవతి॥

## శంకరాభరణం_ఆటతాళం

వేంకటేశ రారా శ్రీ పంకజ లోచన రారా
ఇట్టి పలుకేల రారా ॥వేంక॥
దీటు లేని దావాగ్ని నీ తేజము కాదేరా
నీపైన జలరాశి నీకు నిలయమైన దౌరా ॥వేంక॥
సిరి చేపట్టిన నరసింహుడు నీవేరా
తిరము గాను సర్వ లోకాంతర మందుండ వేరా ॥వేంక॥
కాళీయమర్దన నేను కనుగొంటిని రారా
మేలిమి కామాద్రి రామమిత్ర ఇందు రారా ॥వేంక॥

తే॥ వః తెరంగున హరితోన నెలమి పలికె
వెనుక నుండెడి సిరిని కన్గొని నితాంత
మధిక కోపానల జ్వాల లద్భుతముగ
నిగుడ నలమేలు మంగ తా నిట్టు లనియె

## ఘంటారవం_ఆదితాళం

మొక్కిన మొక్కులు సఫలము లాయెను ముదితరో నీ కిపుడు
చక్కగ కోరిన కోరిక లవి కొనసానెను నీకిపుడు ॥మొక్కి॥

చేసిన చేతలు చేకూరెను సరసీరుహముఖి చాలా ॥మొక్కి॥

తలచిన తలపులు నీకు తనంతట తానె ఫలించెనట
వలచిన వలపులు వద్దనినను నీ వాకిలి గాచెనట ॥మొక్కి॥

ఆపద సంపద లెవ్వరికైనను ప్రాప్తింపగ లేదా
నాపతి నన్నెడబాసి తనంతనె నీ పాలి కారాదా ॥మొక్కి॥

కామాచలపతి కృప చెందిన నీ కేమిట కొదవాయె
భామరో శ్రీ వెంకటగిరి నిలయుడు నీ మొగుడిప్పు డాయా ॥మొక్కి॥

**వచనం:**

అనంతరంబున నా యిద్దరు కరకరి చెంది కలహించుచు సరిసరిగా ఏమనుచున్నారు.

## శంకరాభరణం_అటతాళం

ఎంతటి దానివె కామినీ - నీ
వెంత గయ్యాళివే భామినీ ॥ఎంతటి॥

నను జూచి నీ కెంత రోసమా
విన్నప పని యేమి మోసమా
నిన్నెవ్వరైనను పిలిచేరా
నిన్ను తిన్నగ మదినైన తలచేరా ॥ఎంతటి॥

చోటిరో నీ సాటి సేయనా - ఇట్టి
మాటలాడితే ముచ్చటాయనా
జూటు మాటలు నీకు చెల్లునా-కొ
ట్లాటకు వచ్చేవు ఘల్లునా ॥ఎంతటి॥

పరిగాని వాదుల కొత్తురా-నా
సరి వారందరు నిన్ను మెత్తురా
చెలరేగి వచ్చేవు గర్వమా - నీ పీ
తకుకుల నడుగుల నోర్వనా ॥ఎంతటి॥

పదతిరో సిగ్గేల విడిచేవే-నీవు
కుడువని కూళ్లేల కుడిచేవే
జనులెల్ల నిన్ను మన్నింతురా-నిన్ను
ఘన మైనదని మది నెంతురా ॥ఎంతటి॥

నావంటి దానితో జగడమా-యక్క
నీవంటి సతి నిట్లు పొగడమా
ఓసి మంచిది యిట్టి రంతు గాలా
జగము రోసిన దానికి వింతలా ॥ఎంతటి॥

పాలించు మొగుని చెంతను మేలా విభుఁ
డాలించి విను నేమో ఈ వేళా
ఇఁక వెంకపేచుని చూడవే-నీ
వికనైనా ప్రియునితో కూడవే ॥ఎంతటి॥

కామగిరీశుని పదమానా ఇఁక
నీ మాట విడువ లేవో దానా ॥ఎంతటి॥

క॥ ఈ లాగున సరి సరిగా
వాలాయము జగడ మాడు వనితా మణులన్
మేలిమి మెరగ వేంకట
శైలాధిపుఁడూరడించి చయ్యన పలికెన్

## కాంభోజి-అటతాళం

ఇంత కోపము మీకేల వో యింతు లారా-భువి
నెంతటి వారైన నిట్టి రంతులు సేయ రింతు లారా ॥ఇంత॥

ఎందైన నిటువంటి చందము చూడ లే దింతులారా-చెలు
లిందరు నవ్వగ సందడి చేసితి రింతులారా ॥ఇంత॥

ఇటులైన వర కామాద్రీశుడు మెచ్చునా ఇంతులారామీ
రెటులైన నౌకరి కొక్కరు గూడె యుండరే యింతులారా ॥ఇంత॥

## శంకరాభరణం-త్రిపుటతాళం

ఇటుల పలికి సరోజ లోచను డిద్దరు జతగూర్ప తలచుచు
చటుల కుటిల సరాగ నేత్రాంచలము లమర
మాటి మాటికి చూచి అలమేలుమంగ కన్నులు మూసిలక్ష్మిని
నీటు గుల్కుచు కౌగిలించెను నేప్పు మెరయ ॥ఇటుల॥

చెలిమిచే నొకసారి కమలాసన కుచలకు పూలు చుట్టుచు
నెలమి యలమేల్మంగకును ముద్దులు నొసగెను
అపదుగా నొకమాట చిన్నెలు మెరయ నలమేల్మంగ కుచము
కరము లుంచుచు కమల అధరము గరిమె నొక్కెను ॥ఇటుల॥

కామగిరి పతి మిత్రుఁ డొకలను కాము కేళిని సిరిని గూడిన
కామ నలమేల్మంగ ననిశము కలసి మెలసెను

వచనం:

ఈ లాగున నిరుపురి సతులతో హంసతూలికాతల్పంబున శయనించి
యున్న శ్రీ వెంకటాచలపతిని చూచి చెలులు లాలి పాట పాడిరట
యెటువలెను

## ముఖారి-ఆటతాళం

శ్రీ రమణీ చిత్త చోర దయాకర
వారినిధీ సురవార మందారా
సుందరవదన ముచికుంద వత్సల మౌని
బృంద వందిత శ్రీగోవింద ముకుందా
దురిత విదారణ పరమ పూరుషవర
దరి కర కఫచరణ సద్భరణా
హేమాద్రి పతి హిత రామ దనుజ వి
రామ వెంకటాచల ధామాభిరామ

వచనం : ఇట్లు పవళించియున్న యవసరంబున

సీ॥ హరి దిక్కు నందు వేగుచు చుక్క జనియించె
తారలు కాంతిహీనత వహించె
గవులకు కటిక చీకటి నిర్గమించె
వృక్షముల చకోరముల్ సందడించె
చక్రవాకములు నిశ్చలసతి రాణించె
కుక్కుటములు చాల కూసి మించె
కమలముల్ వికసించె కలువలు ముకుళించె
పక్షుల నినదంబు పరిఢవించె

తే॥ దీపకళికలు ధవళ కాంతిని ధరించె
సాంధ్య రాగంబు ఘనముగ సంచలించె
సూర్యుం డుదయించె మంగళ తూర్య ఘకోష
ములను దైత్యారి మేల్కాంచి ముదము మించె

వచనం :

ఇట్లు మేల్కాంచి స్నాన సంధ్యాది కృత్యంబులు నిర్వర్తించి సింహాసనంబున సుఖాసీనుండైన శ్రీమదలమేలుమంగాసమేతుడయిన లక్ష్మీ వేంకటేశునకు ధవళ శోభనాలు పాడిరట యెటువలెను:

## సౌరాష్ట్రి—ఆదితాళం

జయ రవికోటి సంకాశా జయజయ కారుణ్య నివేశా
జయజయ సద్గుణ కోశా జయ జయ శ్రీ వేంకటేశా
జయ పాలితామరబృందా జయ ఘన సచ్చిదానందా
జయ జయ శౌరి ముకుందా జయ జయ వరద గోవిందా
జయ జయ వారిజ నేత్రా జయ జయ జలదరగాత్ర
జయ జయ విమల చరిత్రా జయ జయ హిమగిరిపతి మిత్రా

## శోభనం పాట-సౌరాష్ట్ర—అదితాళం

శోభనె-శోభానమే

వేదము లొసగిన ధన్యునకూ
విబుధుల బ్రోచిన మాన్యునకూ
భూభరము మోచిన పూర్ధునకు
ఆదిమ మూర్తి నృసింహానకు ॥శోభానె॥

వైభవమున వెంకట విభునకు
వటువై వెలసిన శౌరికిని
వసుధాపతి సంహారికిని

పటు బల రావణ గర్వవిదారికి
బలదేవునకును మురారికిని ॥శోభానె॥

పరమాధ్వర ఖండన రతికిని
తురగము నెక్కిన ఘన ధృతికి
వరకామాచల మందిర హితపతి
కరుదుగ వెంకటగిరి పతికి ॥శోభానె॥

## మంగళహారతి_మధ్యమావతి_ఆదితాళం

జలధి సుతా కుచకలశ విలేపిట
కలిత సుగంధ భుజాంతర తే
ఖల దానవ కుల జలద సమీర
లలిత చరిత నిశ్చల భవతే ॥మంగళం॥

అరిదర భాసుర కరసరసీరుహ
పరమ పురుష శుభకర భవతే
మురహర గురుతర దురిత తిమిర
ఖరకర మందరగిరి భవతే ॥మంగళం॥

కామ జనక కలికామద జగదధి
రామ నికామ నిరామయ
కామాచల పుర ధామ హితా
మల వెంకట నాయకతే ॥మంగళం॥

క॥ ఏతాదృశ వైభవమున
పీతాంబరుఁడై చెలంగు వెంకటరమణుం
డాతత వసుధా తల వి
ఖ్యాత యశోవంతుఁడై సుఖమున నుండెన్

ద్విపద :

ఇది శైలసంపన్నీ హృదయపూర వింద
మద సదన్విత దివ్య మధుక సదృశు

డై మనోమహిమతో నలరు కామాద్రి
రామేశ్వరునకు హర్షప్రదంబును

వల్లి సహాయ సుబ్రహ్మణ్యదేవ
పుల్ల పదాంభోజ భూషణం బగుచు

ధనమదాంధుండై దేవ గంధర్వ
భూమి సుతాముఖాంభోజ మిత్రుండగు

రామచంద్రునకు లలామంబు నగుచు
మౌని జన స్వాంత మహనీయ విమల

భానుండై యలమేలు మంగా సమేతుం
డైన లక్ష్మీ వెంకటా దంపతికి

సర్పితం బగుచు గోపాంగనా నికర
దర్పక తుల్యుండై తనరు గోపాల

కృష్ణమూర్తికిని సత్కీర్తి దంబగుచు
విష్ణుశక్తి వహించి విశ్వంబు లోన
వెలయుచు సతతంబుచు వినువారి కెల్ల
గజతురం గాందోళి కామహి రాజ్య
విజయ సామ్రాజ్యాది విజయదంబగును

సకల విద్వత్కవి సందోహములకు

సకలంకి రుచిర మోదాస్పదం బగుచు
సరత సార్వేల సంతతి జలధి
సురుచిర చంద్రుఁడై శుభ భరద్వాజ

గోత్ర పవిత్రుఁడై గురుబుధ వినుతి
పాత్రుఁడై విలసదాపస్తంబ సూత్ర

ఢవ్యుడై సరస సంభావ్యుఁడై సతత
దివ్య బద్దీ వంశ తిలకుఁడై మంత్రి

జనశిఖామణికి నిశ్చల కృపానిధికి
ననఘ గుణాంబుధి కల తేజమంత్రి

కధిపతియైన తన సుబ్బాంబికా మణికి
సతిశయాన్విత పుత్రుఁడై కళావతికి

సౌందర్యవతికి నిశ్చల దయమతికి
నందంబు గలుగు సుబ్బాంగనా మణికి

హృయయేశుఁడై సర్వహిత కరమతికి
సదమల సద్గుణ సందోహ నిధికి

ఘన కృపాంబునిధికి భాగ్య సమాజఖనికి
ననుపమ శ్రీనివాసామాత్య మణికి

జనకుఁడై వెంకట శైల పాదాంఘ్రి
వనజాత భక్తి సంపన్నుఁడై నిత్య

# ఉపకరించిన రచనలు


**అన్నమయ్య సంకీర్తనల్లో జానపద గేయ ఫణితులు (1984)**

డా॥ ఏ. లీలావతమ్మ. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం పిహెచ్.డి.కి సమర్పించిన సిద్ధాంత గ్రంథం.

**ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర (1961)**

యస్వీ. జోగారావు, ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు, వాల్తేరు.

**ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము (1975)**

బాలాంత్రపు రజనీ కాంతరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ.

**తిరుపతి సాహిత్య సమీక్ష (1985)**

రాంపల్లి నాగభూషణం, పవన్ కుమార్ ప్రచురణలు, తిరుపతి.

**తెలుగు సాహిత్యములో దేశికవిత (1970)**

డా॥ ఆర్వీయస్ సుందరం, మానస సరోవర ప్రచురణలు. నెల్లూరు

**త్యాగరాజ కీర్తనలు—విశేష వివరణలు (1975)**

(ప్రథమ భాగము) కల్లూరి వీరభద్రశాస్త్రి, స్వధర్మస్వారాజ్యసంఘము, సికింద్రాబాదు.

**రాళ్లపల్లి పీఠికలు (1978)**



(1978) సం॥ డా॥ ఆర్వీయస్ సుందరం, రాళ్లపల్లి అభినందన సమితి, బెంగళూరు 28.

**వాగ్గేయకారులు-పదకృతి సాహిత్యము (1975)**

పుట్టపర్తి నారాయణాచార్యులు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి, హైదరాబాదు.